# విశ్వప్రకాశము

## (ఖండకావ్యము)


రచన:

భాషాప్రవీణ

**మల్లవరపు జాన్**

చీమకుర్తి.




# అభిప్రాయము

శ్రీ మల్లవరపు జాన్ ప్రకాశము జిల్లాపరిషత్తు లోని సంతనూతలపాడు హైస్కూలులో ప్రధాన ఆంధ్ర భాషా పండితుడుగా పనిచేయుచున్నారు. వీరు పండితులే గాక కవులు కూడాను. వీరి రచనలు సరళశైలిలో సర్వ జనో పయోగముగా అందరికి అర్థమగు చక్కని భాషలో ఉండును. వీరు రచించిన విశ్వప్రకాశము అను ఈ ఖండ కావ్యము ప్రస్తుత కాలమునకు యెంతయో ఉపయోగము, అవసరము. కుల మతముల అన్యోన్య సామరస్యములకు ఈ గ్రంథము తోడ్పడును. మానవసేవయే మాధవసేవ అను ప్రబోధమును చాటుచున్నది. కుటుంబ నియంత్రణయొక్క ఆవశ్యకతను గూర్చి కవి కొన్ని పద్యములు చక్కగా వ్రాసి నారు.

మా జిల్లాపరిషత్తు చేర్మెనుగారు శ్రీ దిరిశల వేంకట రమణారెడ్డి గారు స్వంతముగా కవులు, సాత్వికులు. సరళ హృదయులు నిరాడంబర వ్యక్తి సద్గుణాల రాశి కష్టజీవుల పాలిటి పెన్నిధి వీరికి ఈ గ్రంథము అంకితము ఇచ్చుటలో విశ్వప్రకాశము మరింత ప్రకాశవంతమైనది. ఈ గ్రంథమును అందముగ ముద్రించుటకై ముందునకు వచ్చిన చిరంజీవి నిరంజన్ కు కవివరేణ్యులకు నా ధన్యవాదములు.

ఇట్లు

వై. వెంకటేశ్వర్లు

24-12-73

# పండితాభిప్రాయములు

ఈ ''విశ్వప్రకాశ'మను పొత్తమును వ్రాసినవారు మా మిత్రుడు 'మల్లవరపు జాన్' ఈయన సంతనూతల పాడు ఉన్నత పాఠశాలలో తెలుగు పండితుడు. మా ప్రకాశంజిల్లా అభ్యుదయ రచయితల సంఘసభ్యుడు. అందుచేతగూడ మా కాప్తుడు.

సర్వకవిత్వము హృదయ పరిస్పందియై వెలయుట ప్రాచీనమైన విషయము. అదియేనాడైనను అంతియ. కవిత్వమునకు భావము శబ్దమునను నవి రెండు ముఖ్యపరికరములు గదా! ఈ రెండును కవి పుట్టి పెరిగిన వాతావరణము మీదను విద్యమీదను సంస్కారముమీదను ఆధారపడి యుండును. మా మిత్రుడు చిన్నతనమునుండి కావ్యములను శ్రద్ధగా చదువుటయేగాక అందుపాధ్యాయుడు గూడనైన వాడు. అందుచేత ఆయన కళయును జీవితమును ఏకసూత్రమున పెరిగినవి. నాకు తెలిసినంతవఱకు స్వభావముచేత ఈయన సరళమైనవాడు. అందుచేతనే వాక్కు సరళమైనది. ఇది ఛందోబద్ధమైన రచనయైనను ఇందు ప్రౌఢశైలిలేదు. మధురశయ్యా పరిపాక మీ కవికి సహజమై ఈయన కవితకొక విలక్షణమైన శోభను కూర్చినది. ఇందిరువది శీర్షికలున్నవి. ఒక్కొక్కదాని యందును దాని భావగతిని బట్టి

తనంతతాన శబ్దగతి కోమలముగను ఆకర్షణీయముగను నడచినది.

వర్ధమానుడగుచున్న శ్రీ జాన్ ఇతోధికముగా ననేక పద్యకావ్యములను వ్రాసి ఇట్లే ఆంధ్రభాషా యోషకు అలంకారముల గూర్చి చరితార్థుడు కావలయు నని ఆశీర్వదింతును. అస్తు

ఇట్లు,
"వారణాసి"

ఒంగోలు
తే 11-12-1973.

యం. వి. యస్. శర్మ, యం.ఎ.
ఆంధ్ర శాఖాధ్యక్షుడు.
సి. యస్. ఆర్. శర్మ కళాశాల, ఒంగోలు.

# అమరవాణి

జాను తెనుంగునందు నెఱజాణతనంబున గైతలల్లి భూ
జానుల మెప్పుగన్న యల జాషువ వేంకట సత్కవీంద్రులీ
జాను కవీశురూపమున జన్మమునంది రటన్న యూహ నా
మానసమందు దోఁచె; సుమ మంజుల మార్దవ శైలి

నారయన్;

మాటలు తేనెసోనలును మాధురి చిందు వినూత్న భావముల్
దీటగు శైలిసంపదయు తీయని తేట తెనుఁగు నానుడుల్
వాటములైన రీతులు విలాసము లొల్కు రసైక వృత్తముల్
సూటిగ జెప్పనేర్చితివి; సూరి శిఖామణి! జాను సత్కవీ!

విశ్వప్రకాశ కావ్యము
విశ్వశ్రేయంబు గూర్చి విఖ్యాతిగ న
పైశ్వర్య శోభితంబై
శాశ్వత కీర్తుల నొసంగు జాను కవీంద్రా!

ఇట్లు,

ఒంగోలు
తే. 11-12-73

విద్వాన్ — కాకుమాను డేవిడ్
తెలుగు పండితుడు
ఏ. బి. యం. జూనియర్ కళాశాల, ఒంగోలు

# ఆకాంక్ష

కవి మిత్రులు శ్రీ మల్లవరపు జాన్ గారు సాంప్రదాయ కవిత్వంలో అభ్యుదయ భావాలను వెలువరించి ప్రబోధించ నుత్సాహపడు సహృదయులు. "విశ్వప్రకాశము" అను నీ ఖండకావ్యమున వీరి ప్రయత్నము సఫలమైనది. ఇందుగల ఇరువది శీర్షికలు అతి ముఖ్యమైనవి. యువతరము తెలిసికొనదగినవి. పద్య కవిత్వమైనను సరళమగు శైలిలో హృద్యంగా నున్నది.

"రతనాల మాలిక" యను శీర్షికనుబట్టి గేయ కవిత్వము నందిష్టము గలవారని తెలియుచున్నది. "విశ్వప్రకాశము" పాఠకులకెంతయు మనోవికాసమును కలిగించు ననుటలో నెట్టి సందేహమును లేదు. మునుముందు గేయ కవిత్వంలోకూడ నేదైన కావ్యమును రచించి ప్రయోజనాత్మకమగు సాహిత్యమును పాఠకుల కందించగలరని నా యాకాంక్ష.

ఇట్లు,

ఒంగోలు
తే, 12-12-73

సముద్రపు శ్రీ మహావిష్ణు
జిల్లా ఎంప్లాయిమెంట్ ఆఫీసరు; ఒంగోలు.

# నే నంటాను

కవిత్వం రాయడం తరతరాల హక్కు గాదు, తాత ముత్తాత లిచ్చిన ఆస్తీకాదు. సంస్కారం - సాధన-అనుభవం-ఆవేశం మేళవింపబడితే మేలైన కవిత్వం రూపొందుతుంది. కవి హృదయం కలవర పరచిన శోకమే శ్లోకమై మహాకావ్య మూ విర్భవించింది. కవిత్వానికి కులం తోనూ, స్థలంతోనూ పనిలేదు. కావలసిందల్లా కలంలో బలం.

మిా మిత్రుడు శ్రీమల్లవరపు జాన్ ఆధునిక సామాజిక వ్యవస్థను బాగుగా ఆకళింపు చేసుకొన్నవాడు. సెక్యూలరిజం ముసుగులో దాగిన సత్యాలు చవిచూచినవాడు. సమాజాన్ని మేల్కొలుపు పనెంచినవాడు. అందుకే మహాపురుషుల జీవితాదర్శాలను పలు శీర్షికల్లో ప్రత్యక్షం గావించాడు. విశ్వ ప్రకాశాన్ని వెలిగించాడు. రసవత్తర కావ్యం రచించాడు.

ఛందోబద్ధంగా సరసమైన శైలిలో సామాన్య పాఠకుణ్ణి సైతం ఆకర్షించాడు. మధురకవి అనిపించాడు. మానవతను మేల్కొలుపడానికి మా మిత్రుడు మరెన్నో కావ్యాలు రాయాలని మనసారాకోరుతున్నాను. మా కవిమిత్రుని ప్రతివాక్కు పాఠక హృదయాలను స్పందింప జేయగలదని ఆశిస్తున్నాను.

ఒంగోలు
తే 12-12-73

దయానంద

# నా అభిలాష

వాడుక భాషలో చిన్న చిన్న రచనలు చేస్తున్నా మా మిత్రుడు జాన్ తన పుస్తకంమీద పండితాభిప్రాయం ఇమ్మన్నప్పుడు నా అర్హత యెంతోనని వెనుకాడినాను. కాని తప్పలేదు.

జాన్ గారు ఒక చిన్న కుటుంబీకుడు; ఐతే వారు రచనలో మంచిదిట్ట. వారి చిన్ననాటి అనుభవాలను మేళవించుకొని యీ రచనలు చేశారు. దానికి దృష్టాంతము వారెన్నిక చేసిన అంశాలు. ఇవి తెనుగు గడ్డమీదనున్న ప్రేమ-ప్రీతి మొదలు సంఘములో జీర్ణించుకపోయిన కుళ్ళువఱకు విస్తరింపబడ్డాయి.

గ్రీకు భాషలో 'లాగాస్' అనే పదం రెండర్థాలను తెలుపుతుంది. భావములేక భాష. భావ దరిద్రమున్నచో భాషగూడ దరిద్రంగా వుంటుంది. కాని ఈ కావ్యంలో భావము-భాష పరిపుష్టంగా గోచరిస్తున్నాయి.

వీరి రచనలో భావగాంభీర్యము, భాషాసౌష్టవము సౌజన్యత, మాధుర్యం, సమ్మిశ్రితమై చదువరుల కానందాన్ని పంచిపెడతాయి. ఎందువల్లనంటే వాడుక భాష కలవడిన పామరులుగూడ చదివి అర్థం చేసుకోగలరు. అందువల్ల యీ గ్రంథం అందరికీ ఉపయోగకరం. ఇటువంటిగ్రంథాలు పెక్కులుగా ఆంధ్రులకు వారందిస్తారని ఆశిస్తున్నాను.

కడప
తే. 12-12-72

డా॥ జె. వీరాస్వామి

**B. A; M. B. B. S; D. P. H; D N**
**District Medical and Health Officer**
**CUDDAPAH**

# నా మాట

ఇది నా యనుభవావేశములతో బెనవైచికొని యావిర్భవించిన ఖండకావ్యము. ఈనాడు సాహిత్య జగత్తున వింతవింత పరిణామము లెన్నియో పొడసూపుచున్నవి. కవి తన భావానుకూలమైన శబ్దజాలముల నేర్చికూర్చి స్వర యుక్తముగా నమర్చి రూపకల్పన జేయును. ఈ రూప కల్పనలోని సొబగుల నలంకారమనియు. మాటల కూర్పును శయ్యాయనియు, స్వరయుక్తతను ఛందస్సు అనియు నిర్ణయింపబడినది.

ఛందస్సు సర్వపరిష్వంగదారుణమనియు, భావ ప్రకటన కంతరాయమనియు, వ్యాకృతి భాషాశ్రృంఖలమనియు, అభినవ్యులు వచన పద్యరచన చేయుచున్నారు. సత్యమరసినచో భావస్ఫోరకత్వమునకే ఛందస్సు ఆవిర్భవించినది. ఛందోబద్ధమగు రచనచేయుటలో ప్రసవవేదన మనుభవించిన నది యతని దోషమేగాని ఛందస్సుదోష మే మాత్రమును గాదు. అందువలన దేనికదే గొప్పది. అన్నిరకముల రచనా ప్రక్రియలందును అందఱు గొప్పవారు కారు. రచనా విధానమునకన్న రచయిత యొక్క సత్త్వ ప్రధానమైనది.

ఈ యుద్దేశముతోడనే "మార్గ" కవితామార్గము నెన్నుకొని ఈ కావ్యమున రచించితిని. నే నిందెంతవఱకు కృతకృత్యుడనైతినో సహృదయ పాఠకులు నిర్ణయింతురు గాక!

నా కవితా వల్లరికి దోహదమిచ్చి నన్నన్ని తెఱఁగుల నాదరించి నా యభ్యుదయ మాకాంక్షించు-రష్యా, అమెరిగా దేశ పర్యటనానుభవజ్ఞులు, కండ్ల డాక్టరు-శ్రీ యం. వి. యల్. నరసింహారావుగారికి నా హృదయ సుమాంజలి.

సరసులు, సహృదయులు, సాహితీపరులు, కవిత్వమందలి యింపుసొంపులు గ్రహింపగల రసజ్ఞ శేఖరులు, ఒంగోలుజిల్లా పరిషత్ చైర్మనులునైన శ్రీ డి. వి. రమణారెడ్డి కవీశ్వరులు మత్కృతీశ్వరులగుట నాయదృష్టము వారికి నా హృదయ పూర్వకాభివందనములు.

శ్రీ మదాంధ్ర ప్రదేశ్ 'సాహిత్య అకాడమీ' వారు ఈ నా కావ్య పరిశ్రమకు ఉదార స్వభావమున ఇన్నూట యేబది రూప్యములు వితరణించిరి, వారికి నా కృతజ్ఞతలు.

అడిగినంతనే తమ అమూల్యాభిప్రాయముల నిచ్చి నన్నాశీర్వదించిన సాహిత్యవేత్తలకు నా నమశ్శతములు.

ఇట్లు,<br>
గ్రంథకర్త<br>
భాషా ప్రవీణ<br>
మల్లవరపు జాన్

సంతనూతలపాడు<br>
తే. 13-12-73

# నా కృతికి
# ఆకృతి నిచ్చిన
# సుకృతుల ప్రశంస

దిరిసెన పూవుం బోలిన
వర హృదయుని వలన కులము వర్ధిలుకతనన్
దిరిశాలాన్వయ నామము
స్థిరపడి దేశమున సుప్రసిద్ధి వహించెన్;

ఆదిరిశాల నందన వనాంతరసీమ గుణప్రసూన స
మ్మోద పరంపరల్ ప్రకటముంబొనరించిన పారి జాతపున్
బాదపమై రహించి కవి పండిత వర్యుల నుద్ధరించు నీ
యాదరణంబు నెంతకొనియాడ గలాడను; రెడ్డిరాణ్మణీ!

నవనీత ప్రతిమాన మానసుడు; ధన్యాత్ముండు; పేర్వడ్డ స
త్కవి సింహుండు; ప్రసిద్ధ పండితుడు; విద్వత్పారిషద్భవ్య పా
ర్థివు డత్యంత దయామయుండు; రమణారెడ్డి ప్రభుండిప్డు నా
కవితాకన్యను స్వీకరించె, విధి సంకల్పంబు సామాన్యమే!

పిలుదుల జూచి పీటలను వేయు నికృష్టపు నేటికాలపుం
దెరువుల బోక దీపిత సుధీ బలమున్ దులదూచి నిండు సం

బరమున గారవించెదవు భవ్యమనస్కుఁడవై; నిజాయితీ
పరులకు భేదభావములు పట్టవు; గిట్టవు; పెట్టుఁబోతలన్ ;

పేరునసెగాక గుణముల తీరునందు
కలదు పోలిక-నీకు వెంకట రమణున
కవని పాలక వరులు దైవాంశులనుట
ప్రబల సత్యము; వెంకట రమణరెడ్డి!

ముడుపీయ దుర్యోగ ముడిపి బ్రోచునతండు
ముడుపు లేకుద్యోగ మిడునితండు
పాదుక తల నద్ది పంపించు నాతండు
అభయ హస్తము నిచ్చి యంపు నితడు
పాంచ భౌతిక లోక పరిపాలకు డతండు
పరిషత్ప్రపంచ నృపాలు డితడు
అరుగు వారల నెత్తి గోరిగించు నాతండు
పిలిచి వాక్సుధల గుప్పించు నితడు

అతడు నామాల ధరియించు; నప్పుడప్పు
డితడు పూమాల మెడదాల్చు, నతని కన్న
దొడ్డవాడితండని దెల్పరెడ్డి పదము
భ్రమసెనేమో! నిన్ వెంకట రమణరెడ్డి!

పరహితుడు నీదు సుతుడు గోపాలరెడ్డి
సన్నుతుల గాంచి శాసన సభ్యుడయ్యె

కనబడునె! రత్నఖనిలోన గాజుపెంకు
పొడమునే! విశ్వమున మేక పులికడుపు

సమ్మకమున శ్రీ చైర్మను
సమ్ముఖమున నుండి నాకు సాయపడిన మా
తుమ్మల రాఘవరెడ్డిని
సమ్మద హృదయముననే న జస్రము దలతున్;

రమణారెడ్డి వరించిన
కమనీయంబైన నాదు కావ్యకుమారీ!
సమకూర్చుమ! నీదు మనో
రమణున కాచంద్ర భాస్కరంబగు కీర్తిన్;

# మత్తేభ మాలిక

సిరిగీర్వాణుల ముద్దుబిడ్డవయి వాసింగాంచి భాసించు శ్రీ
దిరిశాలాన్వయ వార్థిసోమ! గత జాతీయైక్య సంగ్రామ! భా
సుర విద్వద్విభవాభిరామ! పరిషత్సుత్రామ! స్వచ్ఛాంధ్ర కీ
ర్తి రమాలంకృత సీమ! డీ; వి;రమణారెడ్డీ! బృహన్నామ! నీ
సురు చిత్వామల కార్య నిర్వహణకున్ జోహారు! శ్రీ
ఒంగవోల్

పరిషత్సభ్యులకున్ భవత్సఖులకున్ బల్మారు జోహారు! వి
స్ఫుర దాంధ్రామర సాహితీ పటిమకున్ జోహారు!
జోహారు! మా

పరిషచ్ఛైర్మనువర్య! మాండలిక విద్వత్సత్కవీంద్రాళి చే
విరచింపబడినట్టి ''పొద్దు పొడుపున్'' వీక్షించి తత్కావ్య మా
దరణీయంబుగ నంకితంబుగొని యుత్సాహంబు దీపింప నీ
పరితోషంబు వెలార్చి స్వీయ రసవత్పద్యాల హృద్యంబుగా
సరవిన్ గానము జేసి పండిత సభాస్తారుల్ ప్రశంసింపగా
కరతాళంబుల మధ్య కృష్ణ విభువై కన్పించు నీకన్న నె
వ్వరికిం జెప్పుదు నా చరిత్ర? నెవరిం బ్రార్థింతు? నావేదనా
భర మెవ్వారలు దీర్తు? రమ్మయయినన్ బ్రార్థింపకే బెట్టునా!
పరిషత్పాలక! ఆలకించి దయ నాపై కొంత వర్షింపుమా!
ఇరవై య్యేండ్లెలిమెంటరీ బడులలోనే విద్య బోధించు టీ

చరుగానున్న ననున్ దయామయుడు సుస్వాంతుడు శ్రీకండ్ల డా
క్టరు-ముక్కామలనారసింహవిభుడొక్కండాశ్రయంబిచ్చి తా
గరుణించెన్; వివిధ ప్రబంధములు రొక్కంబిచ్చి
చెప్పించె; 'దా
సరి' వంశోన్నతు డాత్మబంధువు 'ప్రకాశ' మాంధ్ర,
యం.యల్.యె. నా
సర సన్నిల్చి విపద్దశన్ గడపె; నాశాసించి పున్నయ్య చౌ
దరి నా సంసరణ స్థితింగని సుధాసారంబు వర్షించె; నీ
శ్వర భక్తిన్ గృషి చేసిచేసి తుదకున్ భాషాప్రవీణుండనన్
బిరుదున్ గైకొని ఆంధ్రరాష్ట్ర సచివాభిజ్ఞుండు ధీశాలి నే
ర్వరి 'శ్రీ నారపరెడ్డి'గారి చలువన్ సత్పండితోద్యోగపున్
సిరి నార్జించితి; చెడ్డకాలము తటస్థింపంగన్ కట్టియున్
గఱచున్ పామయి; చేతబట్టుకొను బంగారమ్మ
మన్నాను; నా
దురదృష్టాన 'రివర్టు' చేయబడి యెంతో క్రుంగి కూలారి నా
చరితన్ విన్నం బ్రమోషమిత్తురని మీ సాన్నిధ్య
ముంగాంచి నా
పరితాపంబును వెల్లడింప దయతో పాలించి లాలించి 'ట్రా
న్స్ఫరు' లేకుండ ప్రమోషనిచ్చి కడు సంభావించుటే గాక నా
కిరవారన్ గురు సన్నుతంబయిన సీ.యీ. బోర్డునందొక్క మెం
బరు షిప్పున్ దయచేసి యభ్యుదయ సౌభాగ్యంబులం
దేల్చు నో

సరదారా! కవితా సరస్వతి కృపాసారంబులంగ్రోలి నే
విరచింపంబడినట్టి కబ్బములు నిర్వేదంబుతో పేటికాం
తరమై మూలుగుచున్న వందులకు సంతాపించు నా జీవితాం
బర వీథిన్ కడగండ్ల కారుమొగిళుల్ వ్యాపించె; నవ్వాని నీ
కరుణావాతహతిన్ జితించి సుగుణాకారా! శరచ్చంద్రికల్
గురిపించన్నిము వేడినంతనె దయన్ గూర్మిన్ ప్రదర్శించి నా
వర మీడేర్చుట కిచ్చగించిన కృపావార్ధీ! విషాదాన స్వో
దర సంపూరణ కార్యమగ్నులయి నిత్యంబున్ వియోగాగ్నిలో
నరకంబున్ జవిజూచు నాలుమగలన్నన్ గోరికలుదీర్చు మా
సుర భూజంబవు నీవు; భృత్యులును దాసుల్ గూడ నీ నీడలో
వర సౌఖ్యోదయ కాంతిపుంజములతో వర్ధిల్లుచున్నారు; సం
స్మరణీయాధిప! నీ వెఱుంగని శ్రుతుల్ ధర్మంబులున్ నీతి శా
స్త్ర రహస్యంబులు లేవు; వాని నిట ప్రస్తావింప నేనెంత? నా
పరిశీలించిన విద్య యెంత? సకల ప్రాపంచికం బేలు నా
గురు భాస్వంతునిముందు దీపిక వెలుంగుల్ చిమ్ము నే!

భవ్య సుం
దర సౌగంధిల బంధుర ప్రసవ గంధమ్మున్ గుబాళించు నీ
సర సోదంచిత పద్య మాలికల భాషా దేవి కంఠస్థలిన్
పారయన్ జేసిన సత్కవీశ! కళలన్ పోషించి భూషించు వా
రరుదై పోయిన నేఁ డెడారులను 'ఒయాసిస్సు'లంబోలి కొం
దఱు నీవంటి మహాశయుల్ గలరు! ఆంధ్రౌన్నత్య సత్య
ప్రభల్

మఱుఁగై పోవునె! విద్య నేర్పు గురువుల్ మాన్యుల్ గదా! వారికిన్
గురు శుశ్రూష నొనర్చి యొక్కరు 'మహాత్ముం'డయ్యె వేఱొక్కరి
ద్ధర 'నేతాజి'గ మారె; నొక్కరుడు ప్రాధాన్యత్వముం బూనె నొ
క్కరు మంత్రిత్వమొనర్చె; నింకొకరు పక్షానాయకుం డయ్యె; డా
క్టరుగా నొక్కరు; యాక్టరై యొకరు; సత్కావ్యాల నిర్మాతయై
మఱియొక్కండిటు లెందరెందఱో! గణింపన్ కీర్తి సౌధాలపై
సిరులన్ వెల్గిరి; కాని నేటి గురువుల్ చీకాకులో చింతతో
ధర లాకాశమునంట నల్పమగు జీతాల్జాల కెల్లప్పుడున్
అరువుల్ దెచ్చి బజారునంబడుట దేశాభ్యున్నతాదర్శమే!
పెఱయుద్యోగిని జూచి 'హోటలు'న 'కాఫీ' త్రాగనై జేబులో
కరమున్ దూర్చిన సీమ సున్నముల ముక్కల్ జిక్క దౌర్భాగ్య దు
ర్భర జీవన్మృత ప్రాయులై బ్రతుకు భారం బీడ్చుచున్నారు మా
గురువుల్; మూలుగు నక్కనెత్తిన బడెన్ క్రొందాటి పండన్న య
ట్లిర కాటంబు ఘటించు 'ట్రాన్సుఫరు' లాయా చోట్లకుం జేయ కం

దరి మేల్గోరుచు న్యాయ దృక్కుల నుపాధ్యాయత్వముం
బ్రోచు నీ

కరుణాంతః కరణంబు గాంచి యనురాగస్యంది నా కావ్య సుం

దరి నీ కంకిత మాట కొప్పికొనియెన్ ; ధర్మాత్మ! వీక్షించి నా

విరచింపంబడి నట్టి కావ్యతనయన్ 'విశ్వప్రకాశమ్ము' నా

దర మొప్పన్ గ్రహియించి మించితివి; యేతత్కావ్య
యోగంబునన్

చిర జీవంబును చిత్తశాంతియు యశశ్రీ భోగభాగ్యంబులున్

సరగన్ గల్గునుగాక! జిల్లపరిష చ్చైర్మన్నిధీ! వాఙ్నిధీ!

# విషయ సూచిక

—:o:—

# కృతిభర్త



ఒంగోలు జిల్లా పరిషత్ ఛైర్మన్

## శ్రీ దిరిశాల వెంకట రమణారెడ్డి

కాలికి షాపు చెప్పులు, ముఖమ్మున బొట్టును కండ్లజోడు, మీ
గాలిని తాకు పంచె; సరిగంచుల కండువ వల్లెవాటునున్,
పాలమెఱుంగు లాల్చి దిన పత్రికలన్ ధరియించి వెల్గు నీ
వాలక మాంధ్ర జాతి కొరవళ్ళు గదా! దిరిశాల వంశజా!

# ఆంధ్రమాత

కనులు రెండైన దృష్టి యొక్కఁడగునట్లు
కన్న జననియు నే బుట్టియున్న ధరణి
యొక్కటేనని నీ ప్రాభవోన్నతులను
తలచి కొనుచుందు నాంధ్రమాతామతల్లి

భారతాంబకు ముద్దు కుమారి వగుచు
సోదరీ సీమలకు కళాసుధల నిధులఁ
బంచి సత్కీర్తి గాంచి రాణించి మించు
ఆంధ్ర మాతా! సుజాత! జోహారు నీకు

నీ లాలి పాటల నాలించి 'త్యాగయ్య'
రాగాలతో స్వర్గ భోగమందె;
నీ పల్కుఁదేనెల నాని 'కవిత్రయ
మ్మ'తి కౌశలమున భారతము వ్రాసె;
నీ భక్తిపాఠాలు నేర్చిన 'గోపన్న'
దివి నంట రామ మందిరము గట్టె;
నీ రూపు గని 'టంగుటూరి ప్రకాశము'
మఱ తుపాకికి ఱొమ్ము విఱిచి నిలిచె;

సత్య సంహిత స్వాతంత్ర్య సమర భూమి
నడుగు బెట్టిరి ముక్కోటి యాంధ్ర సుతులు

నాటి ప్రాభవోన్నతుల నీనాడు నిలిపి
ఆదుకొనుమమ్మ బిడ్డల నాంధ్రమాత!

కరవాలమును రక్తఝురిలో గడిగి గద్దె
నధివసించినది 'రుద్రమ్మ తల్లి'
ఆంధ్ర వీథుల సువర్ణాక్ష రమ్ముల ముగ్గు
చిత్రించినది కవయిత్రి 'మొల్ల'
ప్రియున కాహావము జ్ఞప్తికిఁ దెచ్చి వీర గం
ధమ్ము పూసినది 'పల్నాటి పడుచు'
పురిమీఁదఁ బడు తెల్లదొరల బొమ్ముల గుద్ది
బెదరగొట్టినది 'బొబ్బిలి వధూటి'
పురుషులే గాక నీ రూపు పుంజుకొన్న
ఆడవారును నాడు విఖ్యాతి గాంచి
వన్నెకెక్కిరి దశదిశల్ సన్నుతింప
అమల విజ్ఞాన సముపేత! ఆంధ్ర మాత!

ఆమరణాంతమున్ నిరశనాధిక దీక్షనుబట్టి పొట్టి శ్రీ
రాములు నీకు సుందర ధరాతల రూపమొసంగునప్పు డీ
భూములు దద్దరిల్లినవి పుత్రుల దెబ్బకు; ఏడు కొండల
స్వామి శుభంబు బల్కెఁ; నరవల్ తలవంచిరి కుంచితాంగులై;

ఉలితోడ శిలలను మలచి జీవముఁ బోసి
సృష్టిజేసిన 'హంపి' శిల్ప నగరి;

బండ బండకు బుద్ధ భగవాను డగుపించి
కరుణ బుట్టించు 'నాగార్జునాద్రి';
పారమార్థిక తత్త్వభావ సంపద దాల్చి
శిరమెత్తికొను 'అలంపురి' మహాత్తు;
ఆకాశవీధుల నంటి జాతీయ తో
న్నతిని జూపెడి 'గజపతుల కోట'
కర్కశ కరాళ కాల చక్రాల క్రింద
చితికిపోక గౌరవ మింత చెదర నీక
నిలిచి నీ సుస్థిర చరిత్ర తెలిపి తెలిపి
అలసి పోయినవమ్మ దివ్యాంధ్ర జనని;

ఎప్పుడు తెల్గుభాషఁ బఠియింపనివానికి నాంగ్ల భాషయే
గొప్పగ దోచదా! తెలిసికొన్న విదేశజు లాంధ్ర వాణికిన్
మెప్పు ఘటించె; 'బ్రౌను దొర' మిన్నగ
బ్రహ్మరథమ్ము బట్టె; నొ
కప్పుడు చప్పరింప రుచియా పొరుగిండుల పుల్లగూరయున్;

పీ,యూ,టి, పుట్టగుటయున్
బీ,యూ,టీ, బట్టుగా విభేదించుటయున్
న్యాయమ! వాఙ్మయమున; మన
కీ యాంగ్లముమోజదేలనే! జనయిత్రీ!

పదవుల ప్రాకులాట; సముపార్జన కెప్పుడు దేవులాట; క్రొం
జదువుల పీకులాట; విరసంబగు మాట; ముఠా గలాట; లో

మొదల చిరాకు మూట; కృశియించిన పేదల గూల్చు వేట; నీ
వదుపున బెట్టుకున్న నిక నాంధ్ర జగమ్ము పురోగమించునే!

కూటికి గుడ్డకున్ నిలువ గూడునకున్ దరిలేక తొల్లి ము
క్కోటి తెలుంగులే వెతల గుందుచునుండగ నేటికేటి కీ
వేటికి పిల్లలంగనెద; విప్పటికే దరిదాపు నాలుగుం
గోటులు మించె; మంది సమకూడిన మజ్జిగ పల్చనౌ గదా!

తిరమగు స్వర్గమున్ భువికిఁ దెచ్చెదనంచుఁ బ్రసంగవేదిపై
కరకర గోసి లేత సొరకాయలు కొందఱు నాయకుల్ క్రియా
చరణ నుపేక్షజేసి తమ సంపద బెంచిరి; ‘వట్టి గొడ్లకే
అఱపులు జాస్తి’యన్న నుడి యందలి సత్యము నీ వెఱుంగవా!

వంచన జేయుచున్ నెలకు వచ్చిన జీతము చాలదంచు నే
తెంచిన వారి దుంప తెగద్రెంచుచు ‘ఆఫీసు’లందు దండిగా
లంచపు కూడు మెక్కి తమ లాభము లెంచెడి లంచగొండ్ల శి
క్షించకయున్న నీ పరువు చిక్కదు, నీతియు దక్క, దమ్మరో!

ఆలము రేపి ‘యాహ్యాడు’ నిరాశ్రయ జీవుల జేసి తూర్పు బెం
గాలులఁ ద్రోలె; వారు సుడిగాలికి లేచిన పొట్టువోలె నీ
పాల బడెంగదా! అతిథిపాలన నేర్చిన గేస్తురాల! మా
పాలు రవంత తగ్గినను పంచవె! వారికి పంచ భక్షముల్;

అదిగో! పాగ్రిపు లగ్నిగోళముల యుద్ధావేశులై వచ్చె మా
కెదురే మున్నది; ఆనతిమ్ము జనయిత్రీ! ఆఘ మేఘాలపై
కదనక్ష్మాతలిఁ జొచ్చి సింహములమై గాండ్రించి తత్సైన్యమున్
చిదియంగొట్టి జయించి పాగ్ధరణి భస్మీ భూతమున్ జేయమే!

మొన్న మొన్ననె నీ పెద్ద ముద్దు సుతులు
కలతలంబడి నిను రెండు ఖండములుగ
నఱకనుంకించి మానుకొన్నారు తల్లి!
అమ్మనుం జంప చేతులెట్లాడు నమ్మ;

తెలుగులని యొకరు మము నాంధ్రులని యొకరు
నామభేదానఁ బిలుచుచున్నారు గాని
తుదకు రెండును పర్యాయపదములనుచు
తెలుపవే తల్లి! నీ కీర్తి తేజరిల్ల!

# అస్పృశ్యత

చెప్పరాని వాడని నిన్ను జెప్పువాని
తప్పు జూపి గట్టిగ బుద్ధి జెప్ప వెఱచి
దూర దూరముగా నమస్కారమనుచు
నెంతకాలము నీవు సహింతువయ్యా!

నాకమునుండి యూడిపడెనా? యొకరుండు; మఱొక్కరుండధో
లోకమునుండి వచ్చెనె? ప్రలోభులు స్వార్థము నెంచి మానవా
నీకమునందు నగ్రజులు నిమ్నజులన్న విభేద తత్త్వముల్
వాకొని మభ్యపెట్టి వెలివాడల నుంచిరి నిన్ను; సోదరా!

ఎక్కువ మా కులమ్మను మహీసురులైన వివాహవేళ నా
చుక్కలలోని నీయనుగు సోదరియైన 'అరుంధతీ' సతిన్
మ్రొక్కులు వెట్టి చూచి శుభముల్గొనుచుండగ నీకులంబెటుల్
తక్కువయయ్యె; దుర్జనుల తంతులు చిత్రవిచిత్రముల్ గదా!

కుక్కకు పందికిన్ బసులకున్ వసియింపఁ గులీను లిండ్లలో
హక్కులనిచ్చి పంచముడ వన్న నెపంబున నిన్ను ముందు పం
చెక్కఁగనీయ; రీ తెలివి హీనపు చేతులకున్ విదేశముల్
ఫక్కున నవ్వుచుండె; పరువా? మన కీ సిగపట్ల గోత్రముల్

అస్పృశ్యుడని లోక మఱగంటి చూపున
కించ పరచిన కోపించ లేదు;
చండాలుడని వట్టి శాస్త్రిలు గల్పించి
నిందించిన నసూయ జెంద లేదు;
పంచముడని పురి బాహ్య ప్రదేశాల
విడచివైచిన చేయి దుడుక లేదు;
నిమ్నజుండని నెట్టి నీ కష్ట ఫలముల
నారగించిన నోరు జార లేదు;

ఒత్తిగిలి గౌరవమ్ము నీ వుంచుకొలది
తన్ని తలకెక్కు గుణము వదలరు లెమ్ము
కాకి బలగమ్మురా! నీది కదలి రమ్ము
అగ్రజులతోడ నీ హక్కు లందికొమ్ము;

కాలికి చెప్పుందొడిగి, కాయము దాచగ బట్టనేసి లో
కాలకు తిండిబెట్టి చిర కాలము పస్తులతో దపించు నీ
మాలలు మాదిగల్ పశు సమానులు హీనులటంచునగ్రజుల్
కాలము కర్మమెంతు; రుపకారికి జేసెడి మే లిదే గదా!

హరిజనుడన్న పేరిడి మహాత్ముడు నిన్గరుణించి వీధులన్
దిరిగెడి అంటు రక్కసిని చిమ్మరవోవగ రాటపాకుతో
చఱచిన నేమియయ్యె; నది చావక నేడు కులీన మంది రాం
తరముల దాగియున్నయది తమ్ముడ! పాపి చిరాయువౌ గదా!

శ్రమపడి వచ్చు భక్తులకు క్షౌరము జేసి నితాంత ఘోర పా
పములను చెప్పుతో దుడిచి వాంఛల దీర్చెడి వేంకటేశు పా
దములకు పాదుకల్ దొడిగి దైవిక భక్తిని నేర్పినావు; ర
త్నముల ఘనమ్ము దగ్గునె! జనమ్ము గ్రహించి ధరింపకుండినన్;

మాల యతడు; నేను మాదిగ కులజుడ;
నను విభేద ముండు నంత దనుక
కలిసి తిరుగలేవు గద! కులీనుల తోడ
ఇంట గెలిచి రచ్చ కేగుమయ్యా!

పరరాజన్యులు లేరు; నేడు ప్రజలే పాలించు రాజ్యంబులో
తఱుగేమున్నది? సర్వ హక్కుల సమానత్వమ్ము నీ సొమ్మురా!
తిరిపెమ్మెత్తెద వేల? సంఘటిత శక్తిన్ జూపలేలెమ్ము; నీ
యఱచేతన్ పరిపాలనాచరణ భాగ్యం బెన్నడో దోచెడిన్:

హరిజనులని క్రైస్తవులని
యిరు వర్గములుగ ప్రభుత్వ మీక్షించి కృపన్
హరిజనుల నాదరించిన
మఱి క్రైస్తవ్యులకు నన్య మార్గము గలదా!

ఉలికి పడెడి జబ్బుగల సోదరుల కన్న
నున్నతాధిక్యత లున్ననాడు
ధనికుల సౌధాల కునుకు దీయుచునున్న
ఆర్ధిక బలము నిన్నలమునాడు

9

మనసులు పెనవైచికొనిన వర్ణాంతర
పరిణయోత్సవములు జరుగునాడు
నీ మంచిచెడ్డల నిరత మాకాంక్షించు
విద్యాధికుల సంఖ్య పెరుగునాడు
అంటరాని తనంబు నీ కంటబడదు
కులము గోత్రాలగోల నీ కుండబోదు
రాజకీయాలలో నెట్టి రభసరాదు
వెనుకబడిన సోదరుడ! ముందునకు రమ్ము;

# దేశరక్షణ

లేరా! తమ్ముడ! మేలుకొమ్ము; రణభేరీశబ్దమాలింపరా!
రారా! ముందుకు; శత్రుసేన పొలిమేరల్దాటి నీభూమిపై
పోరాడన్ బరువెత్తె; నిల్చి విజయంబో! లేక స్వర్గంబో! నీ
వీరత్వంబును జూపి తేల్చికొనరా! విశ్వాస పాత్రుండవై;

హింస యహింసపై బగ వహించె; నధర్మము ధర్మదేవతన్
ధ్వంసము జే యపాల్పడియె! దైవ సహాయముతోడ విద్వేష
త్వాంసనులన్ రణస్థలి నపార బలంబులతో నెదిర్చి వి
ధ్వంసన మాచరించి భరతక్షితి గావుమురా! సహోదరా!

న్యాయంబున్ గమనింపురా! మనకు చైనావారికిన్ మధ్య సం
ధాయంబైన 'టిబెట్టు'పై తన ప్రభుత్వంబింత లేనప్డు డ
న్యాయంబేగద! యీ దురాక్రమణ; లే లెమ్మింక సైపంగరా
దోయీ! శత్రు మృగాలనంటి సరిహద్దుల్ దాట వేటాడరా!

నెత్తురు బొట్టునేల పయినిన్ బడనీరు స్వరాజ్య యుద్ధ సం
పత్తి వెలార్చి వీరులు క్రమంబుగ హూణుల పెత్తనంబు వి
చ్ఛిత్తి యొనర్చి తెచ్చిన ప్రసిద్ధమహిన్ దిగ్రమింగ వచ్చె; నీ
కుత్తుక పోయినన్ విడువగూడదురా! చెయినా పిశాచులన్

మాటలతో బనేమి? యిక మారదు వారి కుతంత్రబుద్ధి మో
మాట మదేల? పౌరుష సముజ్జ్వల బహుపరాక్రమ క్రియా
పాటవ మొక్కమాటు కనబర్చిన చాలును; నేటి మేటి పో
రాటములోన ద్రోహులు పరాజయ భూతులు కాకపోదురే!

కాలముదాపురించి వడిగా పరువెత్తిరి; తిన్న యింటి వా
సాలను లెక్కబెట్టెడు పిశాచపు గుంపులు; చంపుమోయి; నీ
నేలను కాలుమోపి తొలినేస్తము పూర్తిగ విస్మరించి సై
న్యాలను దించుచుండె; చెయినా నరహంతకు డంతకంతకున్;

పాయక సర్వదేవతలు బారులు దీర్చి వియత్తలాన ది
వ్యాయుధులైరి తోడ్పడ; పరాజయమన్నది లేదు నీకు; చై
నీయులెగాదు వారల జనింపగ జేసిన బ్రహ్మయైన నీ
చాయల నిల్చునే! విజయసంపదగాంచునె! నిన్ను మించునే!.

కావర మెక్కువై భరతఖండ నివాసుల కాటువేయ చై
నా విషనాగరాజు రసనమ్ములతో బుసవెట్టుచుండెరా!
ధీ విభవంబు రంజిల వధింపుము భారత పక్షిరాజ! లే
దా! విషమించవచ్చును; నిదానము కార్య విఘాతమే గదా!

రచియింపరా! నీ స్వరాజ్యాభ్యుదయ వీర
కావ్య రాజంబుల కవికుమార!
పండించరా! నీకు బదులుగా పోరాడు
రణధీరులకు పంట రైతురాజ!

సమకూర్చరా! యుద్ధ సామగ్రి కొట్లలో
తఱుగొకింతయు లేక ధనిక పుత్ర!
పరుగెత్తరా! తొడల్ జఱచి వైరులపైకి
పెద్దమ్మ బెంచిన పేదవాడ!
వర్గ కుల మత జాతి వివక్షతలకు
మంగళము బాడి సంగర రంగమందు
దురిత చైనా తమిస్ర భాస్కరుడ వగుచు
తమ్ముడా! లేచి రమ్ము; దేశమ్ము గొలుకు;

బుద్ధదేవుని సిద్ధాంతములను విడచి
దుష్టచైనీయులని జేయ దూకినారు;
నమ్మకము యుద్ధమును మానె నన్నమాట
అగ్ని, ఋణ, శత్రు శేష మెందైన కీడె!

తెల్లవారి మొగాలు తెల్లబోవగ పోరు
సల్పిన 'అల్లూరి' సాహసమ్ము
పరదేశజుల కెప్డు శిరము వంచని 'పాండ్య
కట్టబ్రహ్మన' యుద్ధ కౌశలమ్ము
మఱతుపాకులముందు కుఱికి గర్జించిన
'ఆంధ్రకేసరి' పౌరుషాగ్ని కీల
పంచశీల విశాల భవ్యసూత్రంబుల
పాలించి చన్న 'జవహరుని' కీర్తి

13

తలపునకు దెచ్చికొని గుండె పులకరింప
జలధి గాంభీర్యమును హిమాచలపు టునికి
కలిగి కరికి లంఘించు సింగంబు కరణి
దూకరా! శాత్రవుల నింట దూరనీక

'జననియు జన్మభూమియును స్వర్గము కన్నను మిన్న'
యంచు నిన్
గనిన విశాల భారతముఁ గారియబెట్టు విరోధి వర్గమున్
దునుమగ లేచి రమ్ము; తగదోయి విలంబము; మంచుకొండ నీ
ఘనత పయోద మాలికల కౌగిలినుండి ప్రతిధ్వనింపగన్;

# త్యాగరాజు

సరస సంగీత సాహిత్య సౌరభముల
నాద తంత్రీచ్ఛటల పైన నాల్గు దిశల
కంద జేసి దివ్యానంద మందినావు;
రాగ తాళ విభ్రాజ! శ్రీ త్యాగరాజ!

లలిత కళా విలాస విపులార్థ పరిస్ఫుట భక్తి భావనో
జ్జ్వల తర కౌముదీ విభవ సారము కోరిక దీర బంచి ని
శ్చలమగు స్వర్గసీమకు నశాశ్వత భూమికి మధ్య నిచ్చెనన్
నిలిపిన త్యాగరాజ! రమణీయకముల్ భవదీయ గేయముల్;

ముచ్చట గొల్పు నీ మధుర మోహన ముగ్ధ సువర్ణ రాశిపై
నచ్చపు జుంటి తేనియల నల్లన మెల్లన జల్లినాడవో!
విచ్చిన పుష్పగంధముల వీచితివో! విధు శీతలాంశువుల్
గ్రుచ్చితివో! అటుల్ జరుగకున్న సదా రుచు లుప్పతిల్లునే!

మేలిమి వీణె నాణెముగ మీటుచు రాగములాలపించినన్
తాలు కళింగి పాము; నలరారును మ్రోళ్ళు చిగిర్చి;హాయిలో
దేలును మాన సాబ్జములు; ధేనువులున్ దలలెత్తి శబ్ద వి
న్యాలము లప్పగించు; ఫణమూపి నటించును పాపజేడులున్.

తిరుపతి వేంకటేశ్వరుల సన్నిధి జేరి
తెఱదీయుమని కోర్కె దెల్పినావు;
మా యింటిదాక రమ్మని రామచంద్రుని
పేరెత్తి నోరార పిల్చినావు;
పక్కివల్లభునిపై నెక్కి వేంచేసిన
కంచి వరదరాజుఁ గాంచినావు;
నిధి కన్న రాము సన్నిధి సేవ సుఖమని
జీవకోటికి బోధ జేసినావు;

నిఖిలలోకనాథ! నీ వాడనే గాద
పలుక వేల యనుచు పిలిచి పిలిచి
బ్రతుకు ముడుపుగట్టి పరవశించిన భక్తి
సాగరుండ వీవె! త్యాగరాజ!

రాజుల నాశ్రయించి కవిరాజులు సైతము నిత్యభోగులై
రోజుల వెళ్ళబుచ్చిరి: సరోజ దళాయత దివ్య నేత్రులై
రాజిలు రామునిన్ జనక రాజకుమారిని బిల్చి నీ వలెన్
భోజన మిచ్చిరే! చరణ పూజలు జేసిరె! సత్కరించిరే!

భక్తిరసవాహినుల లోతుపాతు లెఱుగు
రాజు లిద్దరు గలరు చంద్రార్క నిభులు
పూజ్యు డొకరుండు బమ్మెరపోతరాజు
తలచ నీ వొక్కరుడవయ్య త్యాగరాజ!

అన్నల యీసడింపు వదినమ్మల దుష్ట తలంపు లేకమై
నిన్ననరాని మాటలకు నిందలకున్ గుఱిజేసి యెన్నియో
బన్నము లేర్పరించినను భక్తిరసామృత పారవశ్య సం
పన్నుడవై చలింపవు; హిమాచలమేరు గభీర ధీరతన్;

శివ జటా జూట లుఠిత జాహ్నవి విధాన
భవ దమల హృదంతర దైవభక్తి రసము
పొంగి పొరలి స్రవించి పాపులను మార్చి
గాయక జగమ్మునకు నూత్న కళ నొసంగె;

పల్లకిలోన నీకెఱుక పర్చక శిష్యులు దాచియున్న నీ
ముల్లె హరింపపైబడిన ముష్కర తస్కరు లోసరిల్లగా
విల్లుధరించి బాణములు వేయుచు శ్రీ రఘురామ లక్ష్మణుల్
చల్లగ నిన్నుగాచిరి; నిజమ్మగు భక్తుల కంటునే వ్యథల్;

ధ్యానించితివి; ప్రీతి దైవతమగు రాఘు
వుని వలె నితర వేల్పుల నుతించి
రచియించితివి; భక్తిరుచులుప్పతిల్లంగ
రాగ రంజిత కృతి రత్నచయము
పలికించితివి: వీణియల నంటి మధురిమ
శ్రుతులకు స్వరమైత్రి గతులనేర్పి
సాధించితివి; వేద బోధనార్ణవమున
భక్తి నౌకలనెక్కి ముక్తిపథము

కలిమి లేకున్న కష్టంబు లలమికొన్న
పరుల మురిపించి శత్రులార్వుర జయించి
విశ్వ కళ్యాణ సంగీతవేది మీద
నిలిచి గెలిచిన సాహిత్య నిధివినీవె!

నాద భేదము లెఱిగింప నారదుండు
కానుపించి 'స్వరార్ణవ' గ్రంథరాజ
మిచ్చి దీవించు గరిమ నీకే లభించె;
ధన్యుడవు నీవె! ఉత్తమోత్తముడ వీవె!

భుక్తి రక్తియు భక్తి సన్ముక్తి నొసగు
నాద బ్రహ్మము గనుగొను నట్టి తెలుగు
కృతి కవాటము దెఱచి ప్రకృతికి జూపు
త్యాగ ధన నిధివయ్య! శ్రీ త్యాగరాజ!

శుక్తింబడ్డ జలమ్ము ముత్యమయి సంశోభించు చందాన నీ
వక్త్రాంతర్గత వాక్కు నాదమయమై వర్ధిల్లె పృధ్వీస్థలిన్
భక్తాగ్రేసర! గేయ కావ్యరచనాపారీణ! గానమ్ముచే
ముక్తింగాంచితివయ్య! దేవ గణముల్ మోదాశ్రువుల్
చిందగన్;

గేయ గాన రసము కృతిపాత్రములఁ బోసి
తెచ్చి తెలుగు జాతి కిచ్చినావు;

త్రావుచున్న కొలది తఱుగక తద్రసం
బలరె! నీదు నోటి చలువ దేమొ!

చెడుగుల్ శ్రీ రఘురాము విగ్రహములన్ చేపట్టి కావేరిలో
పడవేయన్-దిగులొంది దుఃఖిత మతిన్ ప్రార్థింప;
నారామచం
ద్రుడె-స్వప్నాగతుడై తదీయ తల ముద్బోధించి దీవింప; నె
వ్వడి నవ్వాని గడించినాడవుగదా! భక్తాగ్రగణ్యుండవై;

చెలువార గిరిపైన నెలకొన్న రాముని
స్నిగ్ధరూపమును వీక్షించినావు;
"నిను వినాసుఖముగానను నీరజాక్ష! నా
ప్రక్కనిల్వు" మటంచు మ్రొక్కినావు;
"శాంత భావములేక సౌఖ్యమే లేదని"
అనుభవానందంబు వినిచినావు;
"రామ! నీవే నన్ను రక్షింప దక్షత
కలవాడ" వనినమ్మి కొలిచినావు;
చింతలేక రవంత విశ్రాంతిలేక
మధుర కంఠమునెత్తి పల్మారుపాడి
ప్రజల దనియించి నిశ్చల భక్తియందె
తనువు మఱచితివయ్యా! శ్రీ త్యాగరాజ!

# ఎందుకు కన్నారు?

అమ్మా! నాన్నా! యెందుకు
మమ్ముల గన్నారుమీరు? మాకున్ మీకున్
కమ్మని సుఖమున్నదె? నర
కమ్మే గద! సంతు నూరక గని విడిచినన్:

మన దేవుళ్ళనుజూడు మప్పితముగా మర్యాదగా సంతతిన్
గని యాదర్శకులైరి; వారి యనురాగ జ్యోతి నాశించి
చేసిన సత్కార్య ఫలంబదేది? ఇదియా! జిబ్బితుగా పిల్లలన్
గనుటే గొప్పదనంబ! దేశ సుగతిన్ గాంక్షింప యత్నింపరా!

కానుపుపైన కానుపయి కమ్మని రక్తము నేలనింకగా
పీనుగు వైతివమ్మ! మముబెంచ శ్రమించుచు క్రొవ్వువత్తియై
నాన గృశించె; పండుగ దినమ్ములు సైతము పస్తులయ్యెనే!
దేనికి గంటివో! యమ ధృతిన్ పదిమందిని మమ్మువమ్ముగా!

అల్లుని కట్నంబు చెల్లింప నందుకే
'అక్కయ్య' నీటిలో ముక్కుమూసె;
చదివియు నుద్యోగ మొదవక 'అన్నయ్య'
ఖిన్నుడై చని రైలుక్రింద బడియె!

మన వెజ్జు నుడివీన మందులు గొనలేక
'తమ్ముడు' పక్షవాతమున గూలె;
పాఠశాలల ఫీజు బరువు మోయగలేక
'చెల్లాయి' విద్యకు నీళ్ళు వదలె;
చిన్నపిల్లలాకలిగొని యన్నమునకు
బదులు-పచ్చి గంగనుద్రావి బ్రతుకుచుండ
కంటనీరు వర్షించి దిగాలు పడుచు
కుమలనేల? ఈగతి తెచ్చికొనగనేల?

ఈగలు దోమలట్లు జనులీగతి బుట్టి ధరాతలంబుపై
మూగి, కడింది క్రిక్కిరిసిపోయిన-భోజన మారగించుటల్
త్రాగుట, నిద్రనుంట, సురతక్రియ సల్పుట నిల్చియే గదా!
సాగుట యెట్టులన్యమగు చాడ్పున నేటి సమస్త కార్యముల్;

ఎక్కువమందిబుట్టి బలహీనులు దీనులునౌట కంటె ఏ
యొక్కరో! యిద్దరో! పొడమి యున్నతులైన-స్వదేశమాతకున్
చిక్కని కీర్తియున్ బలము చేకుఱు; నంతియెగాని యెందుకీ
తక్కిన సంతు దేశమున దగ్ధము జేయన! పీల్చివేయనా!

మరణమునుండి తప్పుకొను మందులు వర్ధిలె; నేటికేటికిన్
బెఱిగె జనాభ; కష్టపడి బీళ్ళను దున్నినగాని ధాన్యపున్
గొఱత తటస్థమయ్యె; నిక కూటికి గుడ్డకులేక దేశమే
పరులకు చేయిజాచు గతిబట్టె; దరిద్రముపట్టె జాతికిన్;

ధనమా! శూన్య; మొడళ్ళు దాచికొన వస్త్రాల్లేవు; నిండైన భో
జనమా! నాస్తి; వసింపనిల్లు నిదురించన్ మంచమా! లే; దికన్
పనులా! చిక్కవు; చిక్కినన్ తగిన సంపాద్యంబు లాభించునే
జననీ! నీవలె సంతతిన్ గనిన దేశంబేమి కానున్నదో!

పదుగుర వెంట వెంటగని పందుల రీతిగ బెంచి మీరలున్
బదవలు జెంది మా బ్రతుకు బ్రద్దలుజేయుటకన్న ముద్దులన్
పొదలెడి పిల్లలిద్దరిని ముగ్గురినిన్ గనియున్న మాకు నే
కొదవలుగల్గు? మీకు సమకూరక పోవునె! శాంతి సౌఖ్యముల్;

'కాఫి హోటలు' నందు ఖాళి 'సీటే' లేక
నౌకరి కోసము వేచి యుండవలయు
సినిమాకు 'టిక్కెట్టు' గొని లోని కేగిన
స్థలము చిక్కక ప్రక్క నిలువవలయు
బస్సెక్కుటకు జంతు బలము జూపినగాని
కాలు మోపను సందు గానరాదు
ఎంప్లాయిమెంటు ఆఫీసు లిస్టున పేరు
వేల సోదరులకు వెనుక నుండు

నిప్పటికి నిట్టి దుస్థితి యెదురు పడగ
దిన దినము జనాభా వృద్ధి గనుచు నుండ
ముందు ముందెట్లు దేశంబు ముందు కరుగు
తన 'కుటుంబ నియంత్రణ' దలపకున్న;

ఇద్దరో! లేక ముగ్గురో! ముద్దుబిడ్డ
లున్న దంపతులే సౌఖ్యమున్నవారు
చిఱునగవుచిందు వారి మందిరములందు
కలిత శాంతి సంతోష స్వర్గాలు మొలుచు;

గురువులు మాకు మీర; లనగూడదుగాని సమస్త జంతువుల్
సురత మొనర్చు తద్రుతువు జొచ్చిన-మానవులట్లుగాక-యే
తరుణము జిక్కినన్ రతుల దాండవమాడి యనంత సంతతిన్
త్వరిత గతిన్ సృజింప వసుధా రమణీ మణి మోయ జాలునే!

ఆధునిక యుగాన నధిక సంతానమ్ము
నాపుకొన్న జాలు; నది యె మేలు;
స్త్రీలు పురుషులేని చేయించి కొనవచ్చు
శస్త్రవైద్యము ప్రశాంతి వెలయ;

గుండెకు నిబ్బరంబు సమకూడగ కండ బలంబు కావలెన్;
కండ బలంబు నొందుటకు కావలె మస్తుగ తిండి; తిండియే
దండిగ గోరినన్ పరిమితంబగు సంతతి గాంచవచ్చు; ని
ట్లుండిన నాడు జాతి సుమహోదయ కాంతుల తొల్కరింప దే!

కోణములు మూడుగల యెఱ్ఱగుర్తు జూచి
చనుడి; మీరిప్పుడే వైద్యశాల కడకు
అచట మీలోన నొకరు నియంత్రణమున
కిష్టపడుడి; చికిత్స చేయించుకొనుడి;

# విశ్వ ప్రకాశ

'మరియమ్మ' యెంత సన్మానార్హ చరితయో!
మహనీయ! నినుగన్న మాతయయ్యె;
'యోసె' యెంత ప్రశాంత భాసుర స్వాంతుడో!
సర్వేశ! లౌకిక జనకుడయ్యె;
'దావీదు' కులమెంత ధన్యత గాంచెనో!
ఏలికా! నీవంశ మూలమయ్యె;
'బెత్లెహే' మెంత పవిత్ర సుక్షేత్రమో!
పూజనీయ! పురిటి భూమియయ్యె;

యేసు నామక! నాడు నే నిల జనించి
నుతుల నర్పించు భాగ్యంబు నోచనైతి;
అందుకొమ్మిప్పుడైన నాయాత్మ సుమము
సర్వలోక ప్రవేశ! విశ్వప్రకాశ!

గగనవీధి నపూర్వ కాంతి చ్ఛటల జిమ్మి
'చుక్క' నీప్రక్కకును చూచి నిలిచె;
రాజు 'హేరోదు' సామ్రాజ్యాధికారంబు
పడిపోవునని భీతిపడి కృశించె;
'దూత' మధుర వాక్కుతో గొఱ్ఱియలవీడి
గొల్లలు పరువెత్తి కొలుచుకొనిరి;

'దైవిక శాస్త్రవేత్తలు' ముమ్వు రరుదెంచి
కైసేసి బంగారు కానుకలిడిరి;
నోరులేని పసులమంద మోఱలెత్తి
అఱచె 'నంబా' యటంచు నీ చరితమెఱిగి
పుడమిపైనాడు నేనేల పొడమనైతి
శాంతిలోక నివాస! విశ్వప్రకాశ!

ఈచిట్టి సామిగాదే! లోక పాపమ్ము
గొనిపోవు దేవుని 'గొఱ్ఱెపిల్ల'
ఈచిన్ని బాబుగాదే! మానవాళిని
రక్షింప వచ్చిన 'రాజరాజు'
ఈబుల్లినాన్నగాదే! ప్రాణములవీడ
ధరణి కేతెంచిన 'పరమవాసి'
ఈబుజ్జితండ్రిగాదే! అపవాదిని
దండింప దలచిన 'దైవసుతుడు'
అనుచు నినుగాంచి విజ్ఞాను లంజలింప
దైవదూతలు పొగడ నాతరుణ మందు
నేను లేనైతినయ్యా! మన్నింపుమయ్యా!
సత్యవాక్య వికాస! విశ్వప్రకాశ

ఆనందపడినార; లమరులు సంగీత
జయ శబ్దములతోడ సన్నుతించి

గుండెలు దిగజారె; కుటిల వర్తన ధూర్త
సైతానునకు శక్తి సన్నగిల్లి
విరిగిపోయె; దురంత వేదనాకర ఘోర
మరణ కంటకము సామర్థ్యముడిగి
తెలుచుకొనె; ప్రశాంత సురుచిర పరమలో
కమునందు పెను కవాటములు కదలి

త్రిత్వమైయున్న దైవమేకత్వమొంది
పుడమిపైనాడు నిసువుగా బుట్టినపుడు
గాంచలేనైతినయ్యా! రక్షింపుమయ్యా!
సహానదీప్తి సందేశ! విశ్వ ప్రకాశ!

దేవ మానవమైత్రి తెగ త్రెంపుగానీక
పూని వచ్చిన 'సమాధానకర్త'
పాపాల చీకట్ల రూపాలు పోకార్ప
జగతికి దిగిన 'తేజస్కరుండు'
పరలోక సత్య సంభరిత మర్మములెల్ల
వినిపించ దొరకొన్న 'వేదవాణి'
మన ధర్మశాస్త్ర లేఖనముల నెరవేర్ప
నవతార మెత్తిన దివిజవరుడు

అనుచు నీముద్దు మోమును గనుచు జనులు
మురిసికొన్నారు 'బెత్లెహేం' పురవరమున
అపుడు లేనైతినయ్యా! నన్నరయుమయ్యా!
జగదధీశ! ఆత్మేశ! విశ్వప్రకాశ!

# ఆంధ్ర కేసరి

ఏ ప్రకాశము ఱొమ్ము విరుపున 'సైమను
దొర' తుపాకులు నేల కొరిగిపోయె;
ఏ ప్రకాశమును కన్నెత్తి చూడగ లేక
తెల్ల దివాంధముల్ తల్లడిల్లె;
ఏ ప్రకాశము మాటకెదురు చెప్పగ లేక
గాంధి సైతము చేయిగలిపి మెలగె;
ఏ ప్రకాశము సాహస ప్రవర్తన నేటి
చదువరులకు దేశ చరితమయ్యె;

ఏ ప్రకాశముపేర జిల్లా ప్రశస్తి
పొంది 'ఒంగోలు' క్రొత్తరూపును ధరించె;
ఆ ప్రకాశము 'టంగుటూ' రన్వయుండు
ఆంధ్రులకు రక్ష! దేశ సమైక్యదీక్ష!

ఖద్దరు గుడ్డకున్ గలుగు గౌరవమెల్ల ఖరాబుజేసి గ్రు
డ్డెద్దు విధాన మేసి గడియించిన సొమ్మునుదాచి మేడలున్
మిద్దెలు గట్టు నాయకులు మీ కొనగోటికి సాటివత్తురే!
హద్దులుమీరి దేశమునకై తమ ఆస్తి వ్యయించు పట్టునన్;

సరియెవ్వారు?స్వతంత్ర భారత మహాసంగ్రామమం దాంధ్ర కే
సరి కంచున్ మదరాసు రాష్ట్రము ప్రశంసింపంగ
నాంగ్లేయపుం

గిరి కుంభస్థలిపైకి దూకిన శుభాకారా! ప్రకాశోత్తమా!
చిర జీవుండవునీవు; స్వార్థరహితుల్ జీవింపరే! దివ్యులై;

జేబులు పెద్ద జేసి చెయిజిక్కిన మట్టుకు నూకి తీసుగా
డాబులుగొట్టు బాబులు ముఠాలుతటాలున కుప్పగూలగా
రేబవలున్ శ్రమంబుగొని రెండుదఫాలుగ ముఖ్యమంత్రివై
శ్రీ బులిపింప 'బాలనము జేసితి; వాంధ్ర మహిన్ బ్రకాశమా!

సిరి గర్వాంధులు కన్నువిప్పగఁ బగల్ స్నేహాన రౌడీలతో
కరముల్ గల్పుచు, రాత్రులందు చదువన్ గష్టించి 'ఫస్ట్ క్లాసు'లో
గురువుల్మెచ్చ జయంబుగొంటివి; పరాకుల్ లేక బాల్యమ్మునన్
పరమాదర్శముగాదె! నీపఠన సౌభాగ్యంబు విద్యార్థికిన్;

తెలుగురాజుల శిరమ్ములమీద దులకించు
మాణిక్య మకుట సంపద్విభూతి
మంత్రి తిమ్మరుసు సమగ్రరాజ్య రహస్య
కళలఁ దాండవమాడు కార్యదీక్ష
ఎఱగడ్డపాటిపై పరువు నర్పించిన
ఖడ్గ తిక్కన చేతి కత్తిపదును
కొండవీటి గుహల కునికి మేల్కొని వీచు
శ్రీనాథ కవితా పరీమళంబు
వీర బొబ్బిలి కడగంటి వీక్షణములు
నేకమై స్వప్రకాశమై ప్రాకటమయి
ఆంధ్ర తేజమై నీవుగా నవతరించె;
కలిత సౌఖ్య సంధాయ! ప్రకాశరాయ!

# గురు దక్షిణ

కలదొక సందేహము నా
తలపున మొలకెత్తి; కులము తక్కువవారల్
విలువిద్య నేర్వతగరా?
తొలగక వివరింపుమయ్య! ద్రోణాచార్యా!

ఎఱుకలవాడ; నన్ను కరుణింపగదే! విలువిద్యలో జగ
ద్గురులని మీ పదాబ్జములుగొల్చి తరింపగ వచ్చినాడ; న
న్నరసి మహాస్త్రవిద్యల కృతార్థుని జేయుమటంచు మ్రొక్కు స
చ్చరితుని నేకలవ్యునెడ జాలి రవంతయుఁజూపవైతివే!

అతడు రాజులతోడ పోరాటమాడ
నెంచి విలువిద్య మిమ్ము నర్థించ లేదు;
పొట్ట నింపుకొనంగ నే పిట్టనైన
కొట్టనేగద! కాదని నెట్టదగునె!

నీవటు నెట్టివైచినను నీవ గురుండని నమ్మి మట్టితో
తావక విగ్రహంబు నొకదానిని జేసి నిరంతరంబదే
భావ పథంబునన్నిలిపి భక్తిసుమంబుల పూజసల్పి దీ
క్షావిధి నభ్యసించె గద! శస్త్రమహాస్త్ర కళారహస్యముల్;

కౌరవ పాండవుల్ బహుముఖంబుల వేటఁ జరించుచుండగా
వారల కుక్క 'భౌ'వ్వుమని వచ్చి పయింబడ నేకలవ్యుడున్
దారుణ బాణ సప్తకము దాని మొగంబున నాటనేసినన్
మారణ భీతినద్ది యజమానుల సన్నిధికేగె నార్చుచున్;

కురుకుమారులు శునకమ్ము నరసి మిగుల
చకితులై సత్వరంబె నిషాదు కడకు
వచ్చి శర లాఘవము గాంచి మెచ్చి, వాని
జీవితచరిత్ర నీతో వచింపలేదె!

పార్థు డతి వినయమున నీ పజ్జ నిల్చి
గురువరా! "ధనుర్విద్యలో నొరులు నన్ను
మించి పోనీక గఱపెదనంచు తొల్లి
మాట యిచ్చితి రది గాలి మూటయయ్యె"

మీకుఁ బ్రియ శిష్యుడట; నామ మేకలవ్యు
డధిక విద్యాబలుండు మీకంటె; నతని
చూతమని చెప్పినంత నచ్చోటికేగు
మీ కెఱుకవాడు స్వాగత మీయలేదె!

కరములుమోడ్చి దైన్యము మొగంబున దోప వినమ్రచిత్తుడై
గురువర! మీకు శిష్యుడను; కోరినవిద్య లభించె మీ కృపా
వరమున;నన్ను బ్రోవుమని పల్కు 'హిరణ్యక ధన్వు'పుత్రు నా
దరమున గాంచకీవు గురుదక్షిణ నెట్లు పరిగ్రహించితో;

ఎఱుక యని ధనుర్వేదంబు నెఱుగు జేయ
వీలు లేదు పొమ్మని త్రోసివేసి; యిపుడు
కులము నెంచక దక్షిణగోరి తకట
తగవుదప్పి చరింప పెద్దలకె చెల్లు;

ఇదె! శరీరమ్ము; పరిజనమ్మిదియె ధనము
కోరుకొమ్మ మీ కిష్టంబు, గూర్తు ననుచు
అమృత వాక్కులు వనచరు నందు బోడమ
విషము నీలోన నెట్టు లావిర్భవించె;

గురువు వగు నీకు దక్షిణాంగుష్ఠ మిడిన
కారణంబున సత్కీర్తి గలిగె గాని—
ఏకలవ్యుని విలువిద్య యేట గలిసె
సమసె పార్థుని రుజ; నీకు శాంతి గలిగె;

* * *

కుటిల దుర్యోధనాదుల కోర్కె దీర్ప
ధర్మజుని బట్టి బంధింప దలచి కాదె!
పార్థు నెదిరింప సంశప్త బలమమర్చి
మురిసి పన్నితి వౌక తమ్మి మొగ్గరమ్ము;

వ్యూహ మభేద్య మిప్డు; విజయుం డిట లేడని సంతసింప త
ద్వ్యూహముజొచ్చి పార్థతనయుం డభిమన్యు డనన్యబాణ సం

ద్రోహము గ్రుమ్మరించిన గుదుల్పడి కర్ణుడు రాజరాజు సం
దేహ మనస్కులై కని పదేపదె నీపయి నింద మోపరే!

ఒక పసివాని చేతబడి యోడె గురుండను మాటకోసమే
చకితుడవైతివో! రిపుల శక్తి నెఱుంగని గ్రుడ్డిరాజు పు
త్రకు నలరింప నెంచితివొ! ధర్మపథంబును వీడి ఆత్మ ఘా
తుకమునకున్ గడంగితివి; తోచునె! స్వార్థులకు త్తమక్రియల్;

కవచధారణ విద్యను గలిగియున్న
బాలకుడు వీడు మనమింక బట్టలేము;
కర్ణ! నీవేగి వెనుక భాగముననుండి
విల్లు ఛేదింపుమని చెప్పఁ జెల్లునయ్య!

ఇనజుడు నీవు చెప్పినటులే యొనరింప గృపుండు సారథిన్
దునిమెను; నీవు ఘుఱ్ఱముల ద్రుంచితి వక్కట తేరుదాకి తు
త్తునియలుజేసె సైన్యము లెదుర్కొనె దుష్టుడు దుస్ససేను నం
దనుడుజ్వల త్పరాక్రమ కృధానలుడై యభిమన్యు బాలకున్;

విరథుడై రుధిరమ్ము స్రవించుచున్న—
మడమ ద్రిప్పక వీరాభిమన్యు డపుడు
ఖలుని దుశ్శాసన తనూజుఁ గసి మసంగి
జంకెఱుంగక స్వర్గ మలంకరించె;

కుతుకము మీర నర్జునునకున్ విలువిద్యల ధారవోసి నీ
ప్రతిమకు మ్రొక్కి చక్కగ నుపాసన జేసిన యేకలవ్యునిన్
పతన మొనర్చినావపుడు; బాలకు నిప్పుడు చంపినావు; నీ
సుతునకు నీకు నయ్యుసురు సోకక మానునె! కుంభ సంభవా!

కుట్రపన్ని 'అశ్వత్థామ కుంజరంబు
చచ్చెనని ధర్మరాజు వా క్రుచ్చినంత
ననుగుబిడ్డడు మరణించె నని ధనుస్సు
జారవిడువ ఫల్గుణుడు నిన్ జంపలేదె!

ఏకలవ్యున కీవు కీడెంచకున్న
భారత రణాన నతడు నీ ప్రక్కనిలిచి
పోరుసాగింప విజయంబు పొందగలరె!
ఇంద్రజుండైన గాని యుపేంద్రుడేని;

ఏకలవ్యుని నభిమన్యు నీసడించి
భంగపరచిన పాప ముప్పొంగి పొరలి
చెంగలించి కురుక్షేత్ర రంగమందు
బలిగొనియె నిన్ను; దుష్కర్మ తొలగి చనునె!

భారతమునందు నీవొక పర్వమునకు
శీర్షమైతివి; శరయోగ సిద్ధిగాంచి
కాని ఫలమేమి? యీ చిన్ని కల్మషంబు
చందురునిలోని మచ్చగా జెందె నిన్ను.

# సుప్రభాతము

పొడుపు గుబ్బలిమీద బుట్టిన వెనువెంట
భూనభంబుల వెల్గు పూతవేసి
నలువెక్క దశదిశా వలయమ్ము నలమిన
కారుచీకటి దుమ్ము కాలజిమ్మి
ఒడలెఱుంగక నిద్ర నుండిన జీవుల
కనురెప్ప దుప్పటి కప్పుదీసి
నీటిలో వ్రతదీక్ష నెఱపు తామరమొగ్గ
నిద్దంపు బుగ్గల ముద్దులాడి
ప్రతిదినంబింతయును తీరుబాటులేక
సుప్రభాత మహోదయ శోభ నెసగి
వేయి కరముల క్రొంగ్రొత్త వెలుగుతోడ
నిండి పయనింతువయ్య! మార్తాండమూర్తి!

ఎలుగెత్తి యింటిపై కెక్కి స్వాగతమిచ్చె
'కొక్కొరోకో' యని 'కోడిపుంజు'
మబ్బుతెఱల జీల్చి మార్గంబు సవరించి
వెడలిపోయిన దొక్క 'వేగుఁజుక్క'
జాము జామునకు భేజారి పడమటింట
చతికల బడిపోయె 'చందమామ'

చుక్కల చీర నాజూకు లేదని విప్పి
కట్టె తెల్లనివల్వ 'గగన కాంత'
మిసిమి వన్నెల దినరాజు మేలుకొనియె
నింక తడవైన బ్రతుక తావేదటంచు
కటిక చీకట్లు చెదరి దిక్కరుల గలిసె;
బాల భాస్కర! నీ సుప్రభాత వేళ!

శివుని ఫేసికంటి చిచ్చున కెనవచ్చు
కిరణ సంచయమును ధరకు దించి
సలిలమాని మలల జలదంబు ముఖమున
వర్షమిచ్చు లోక బాంధవుడవు;

ఒక్కగంతున జలనిధి నుత్తరించు
ఆంజనేయుండు నిన్ను పండని భ్రమించి
గగనమార్గాన వచ్చి నీ సెగల దగిలి
బొగిలి వగచి నిన్ భగవానునిగ నుతించె;

వెడగుదనంబుతోడ నుడువీధిని రాహువు నిన్ను మ్రింగినన్
కడుపున నుంచెనే! వెడల గ్రక్కక; నీ సహజ ప్రదీప్తికిన్
చెడుపు ఘటిల్లెనే! హితము సేయు మహాశయులైన వారికే
యిడుములు గల్గినన్ తొలగవే! పవనాహత నీరదంబులై;

ఒకపరి మేరు పర్వతపు టున్నతి మించిన 'వింధ్య' సైపనో
పక నభమంటి తావక శుభంబగు దారికి నడ్డు నిల్వగా

సకల నరుల్ సురల్ చని విషాదముతోడ నగస్త్ర్యవేడ న
య్యకలుషమూర్తి దాని పొగరంతయు ద్రుంచి వెలింగె
నీ పథిన్;

తిమిరము జీల్చు నీ కిరణదీప్తులు వ్యాప్తిని బొందకున్నచో
నమృతకరుండు చల్లని విహారము మెల్లన జేయ జాలునే!
కమలము లుల్లసిల్లునె! సుఖంబుగ లోకము తెల్లవారునే!
క్రమమున ప్రాణికోటి మనగల్గునె! వెల్గుదొరా! దివాకరా!

# యేసుప్రభుని యేడుమాటలు

తనను హింసించి చంపు దుర్జనులపైన
వలపు వర్షించి క్రీస్తేసు పలికె నిట్లు—
"వీరలేమి యొనర్చుచున్నారో! తండ్రి!
యెఱుగరయ్యా! వీరిని క్షమియింపుమయ్యా!

ఆయనకుఁ బ్రక్క వ్రేలాడ దీయబడిన
తస్కరుడు నన్ను మఱవక దలచు మనిన
"నేడు పరదైసులోన నాతోడ నీవు
కూడియుండెద" వని మాటలాడె ప్రభువు;

బిక్క మొగములతో దన దిక్కు జూచు
మాతృహృదయంబు శిష్యుని మనము నెఱిగి
"ఇదిగో! నీ కుమారుండు; నే డిదిగో! నీదు
జనని" యని బల్కె గుండెలు జలదరింప

గగన తలమున రవి మూడు గంటలపుడె
అంతరించె; పెంజీకటు లావరించె;
గ్రీవమెత్తి "నాదేవ! నాదేవ! నన్ను
నేల చేయి వీడితి" వని యేసు నుడివె;

అంతట సమ_స్తము సమా_ప్త మైనదనుచు
నెఱిగి క్రీస్తు-లేఖనములు జరుగునటుల
''నేను దప్పిక గొనియుంటి'' నీరు నాకు
త్రావ నిమ్మని దీన స్వరమున బల్కె-;

జలము నీయక పచ్చి విసంపు చిరక
కరిను డొకరుండు 'హిస్సోపు' కఱ్ఱతోడ
నందజేయ ''పరిసమా_ప్తమైన'' దనుచు
శిరము వాల్చుగ గుడి తెఱ చినిగిపోయె;

కరచరణముల చీలలు; శిరముపైని
కంటక కిరీట; మీాదెపోటుంటఁ గ్రీస్తు
కేక వేసి ''నా యాత్మ నీ కేలుదమ్మి
కప్పగించు చున్నా''నని అ_స్తమించె;

# తెలుగు తల్లి

పాలును తేనెలుట్టిపడ భారతగాథ కవిత్రయంబుచే
నాలపనంబు జేసి సముదంచిత శోభలతో సహస్ర వ
ర్షాలు గతించిపోయినను చల్లగ తత్కృతి నిల్పినావు; మా
నాలుగుకోట్ల తెల్గుల మనంబులపై అనురాగమూర్తివై;

కమ్మని కొమ్మలై నిశిత ఖడ్గములన్ ధరియించి వీర సై
న్యమ్ములతోడనేగి సమరాంగణ సీమలఁబోరి శత్రు సం
ఘమ్ముల ద్రుంచి రక్త తిలకంబుల దీర్చిన మల్లమాంబ రు
ద్రమ్మల ఝూన్సిరాణుల నయంబున గంటివి; కంటి వున్నతిన్;

ఏయమ్మ పాయసం బీయ భక్షించి మా
'తిక్కన్న' పలుకుల తేనె గురిసె;
ఏ తల్లి చనుబాల నింపారగ్రోలి మా
'త్యాగయ్య' రాగాలు సాగదీసె;
ఏ మాత గృహసీమ నెదిగి మా 'గోపన్న
కొండపై రామయ్య గుడిని నిల్పె;
ఏ సవిత్రీ రూపమెఱిగి మా 'జక్కన్న'
శిలలో నవ జీవ కళలు బోసె;
ఏ జనని పరామర్శలో నింత దనుక
తెలుగు బిడ్డలు మీసాలు దీటుకొనిరో!

ఆ మహాతల్లి-భోగ భాగ్యాలవెల్లి
ధర్మగుణవల్లి! తెల్గు మాతామతల్లి!

'కృష్ణా' జలాలు సోకి ఫలించు తొలిపంట
సిరుల నద్దిన పట్టు చీరగట్టి
పుణ్య 'గోదావరీ' పులినపుం బారాణి
చెలువార నడుగు దమ్ములకు బూసి
'తుంగభద్రా' నదీ తోయ భంగిమలందు
తల మున్కఁగా వేద జలకమాడి
ముక్కారు బండించు ముద్దు 'పినాకినీ'
పసిడి తీగలు మేన భద్రపఱచి

ఇతర దేశాలు నిన్ను కన్నెత్తిచూడ
తెలుగు కస్తూరి తిలకంబు తీర్చిదిద్ది
సుజలవై జీవనము మాకు జూపినావు;
వలపుల రసాలవెల్లి! మా తెలుగుతల్లి!

పాడుకొంటివి గదా! యేడుకొండలమీద
శ్రీనివాసుని శుభాశీస్సు లంది
పవళించితివి గదా! భద్రాద్రిపై రామ
చంద్రుని పరిణయోత్సవము నరసి
క్రీడించితివి గదా! శ్రీశైల శిఖరాన
మల్లికార్జును కృపా మహిమ దలచి

చెలువొందితివి గదా! సింహాచలంబున
నాది వరాహంబు నభినుతించి

అడుగడుగున ప్రశస్త పుణ్యస్థలంబు
గాగ నిశ్చలభక్తి మార్గముల దెలిపి
ప్రేమబంచి సత్కీర్తి పరీమళించి
మెలగితివి గదా! రతనాల తెలుగుతల్లి!

రాజమహేంద్రమున భారత కథా లతికల
కల్లువెట్టిన వేదవల్లి వీవు;
ఓరుగంటి పురాన తారాపథము దాక
ప్రాకిన వీర పతాక వీవు;
విద్యానగర సత్కవీంద్రుల విఖ్యాతి
జాటిన కవితా వధూటి వీవు;
నాగార్జునుని బౌద్ధ నాగరికత జూపు
కమనీయ నవ శిల్పకాంతి వీవు;

భాగవత పురాణ రసాల పల్లవముల
మదుగునందుండి గళమెత్తి మధురగీత
ములను గానము జేయు కోకిలవు నీవు;
తెలుగుతల్లీ! జయోస్తు! సాధ్వీమతల్లి,

# దీపావళి

అడలు పుట్టించు నరకాసురుడు నశింప
దిగులుబాసి సంతసపడు దివిజవరుల
చిఱునగవు వెన్నెలలు నాకసీమనుండి
తొలకరింప దీపావళి వెలిగె జగతి;

నరకుని క్రూరకృత్యము లనంతములై సురసిద్ధ సాధ్యులన్
నరులను బాధపెట్టిన ననంతుడు కృష్ణుడు సత్యభామతో
నరిగి రణంబునందు నరకాసుర కంఠము ద్రుంచ నెత్తురుల్
ధరబడి చిందినట్లు బహుధా సదనంబుల వెల్గె దీపికల్;

పండిత భావనారుచుల భంగి వెలుంగుల తోరణాలతో
నిండె జగత్తు; రక్కసు డనిన్ దెగటారె నటంచు దేవతా
షండము పారిజాతముల జల్లినపోల్కి వియత్తలంబు స
న్మండితమయ్యె, కృష్ణపరమాత్ముని కీర్తిప్రదర్శకంబుగన్;

చేబట్టె! రవ్వలు చిందు మతాబాలు
పసి బాలకులు ధూళి పైకిరేగ
ముట్టించె! తమ యిండ్ల ముందు దీపంబుల
చెలువలు చేతిగాజులు ధ్వనింప
కీలించె! రంగు కాగితపు బుట్టల దివ్వె
గడబాతి యువకులు కాంతులీన

వెలిగించె! మెఱపు మొగ్గలు తళతళలాడ
లచ్చిబిడ్డలు డబ్బు వెచ్చబెట్టి
సజ్జదంటుల దివిటీల సామలోన
ననద లానంద వారిధి మునిగితేల
వింత వింతగ చీకట్ల గొంతు నులిమి
పర్వులెత్తె; దీపావళి పర్వదినము,

పెరిగి నింగినిదాకు ధరల తీరునసాగి
రివ్వున 'నవ్వాయి చువ్వ' లెగుర
తిండి గింజలులేని గండుపేదల నిండు
ఘూత్కారమన 'చిచ్చుబుడ్లు' రగుల
ఓట్లకై యింటింటి కుఱుకు పెద్దలమాడ్కి
'భూ చక్రములు' దీక్ష బూని తిరుగ
కఠినాత్ములగు దురాక్రమణ దారుల గుండె
గాయంబుగా 'టపాకాయ' పగుల
తెలుగు వెలుగు 'పూవత్తి' రవ్వలుగ జెలగ
'అగ్గిపుల్లలు' మన పౌరుషాగ్ని జూప
నంధకార భాండము ప్రీల నోటు ప్రేల
వచ్చె దీపావళీ పుణ్య వాసరంబు;

కుమతులై దేశమును దురాక్రమణ జేయు
ద్రోహచిత్తులు భీతిల్లి తొలగిపోవ
ఢమ ఢమ యటంచు నశనిపాతముల బోలి
ధ్వని జనించె; దీపావళి దిన ముఖమున;

# ఆహుతి

మానవుల రక్షణార్థ మిమ్మహి జనించి
నిట్ట నిలువున నసువుల బెట్టినావు;
మరియ నందన! నీ ఘోర మరణ మరసి
చింతపడి కృంగి నా గుండె చితికిపోయె;

నేరముబెట్టి బెట్టిదపు నిందలు జుట్టి ప్రధాన యాజకుల్
తీరుపుగోరి నిన్సభకు దెచ్చినవేళ 'పిలాతు' సన్నిధిన్
గోరెడు భీతిలేక భ్రమగొల్పగ నుత్తర మిచ్చినావు; నీ
ధీరత సత్యవాక్పటిమ తేలినసైన నినున్ త్యజింపరే!

బందిపోటుదొంగ ప్రాణాలు నీ వల్ల
మిగిలె; శిక్ష నీకు దగిలికొనియె;
నీవు కాలుమోపు నెలవున నెటువంటి
ఖలునకైన చావు తొలగిపోదె!

బలమగు సిల్వమ్రానునొకపట్టున మూపునదాల్చి 'గొల్గొతా'
స్థలమున కీడ్చుకొంచు నడిదారులఁ దూలుచు వాలిపోయి కా
ల్నిలుపగలేక నేల పయినింబడి లేచుట కుద్యమించు నీ
యలసట గాంచి యూదులొకరైనను జాలి దలంప రక్కటా;

భటులటు నవ్వుచున్ సిలువపై గజదొంగల జంటమధ్య న
క్కటికము లేక తస్కరునిగా నిను నిల్పిన కారణంబె—నీ
యటమట లేని జీవితము నందలి సత్యము, నిన్నుజంపు త
త్కుటిలుల కుట్ర, లోకమునకున్ బ్రకటింపదె! సత్యమారునే!

పరిశుద్ధమగు నీదు కరచరణంబుల
దిటవుగా మేకులు దించినపుడు
వేద విజ్ఞానంబు వెలుగు నీ శిరమున
పెనుముండ్ల మకుటంబు బెట్టినపుడు
కరుణారసము పొంగి పొరలు నీ గుండెలో
నీటెతో నొకపోటు వేసినపుడు
నోరెండి నీరంబుగోర పచ్చి విసంపు
చిఱకను నీ కంద జేసినపుడు

యూదులకు రాజువా! యని యొకడు బల్క
కాదు లే! దేవుడని మఱొక్కండు దెల్ప
ప్రజలు కసిబూని వేనోళ్ళ పరిహసింప
నెటుల సహియించితివి నీవు; యేసుదేవ!

ఎక్కడి పరలోకపురం
బెక్కడి నరలోక మిటకు నీ యాగమనం
బక్కట! మానవ పాపపుఁ
జిక్కుల దెగటార్పగాదె! శ్రీ దైవ సుతా!

కంటకములైన యూదులు పకాపక నవ్వుచు గేలిసేయగా
నుంటివి గొఱ్ఱెపిల్లవలె; ఓ పరమేశ్వర నందనుండ! నే
నంటమె గాదు; నీ వలిగినన్ వెనువెంటనె భగ్గుభగ్గునన్
మంటలుమండి మాడి నురుమై నశియింపవె! సర్వలోకముల్;

ఆది తలిదండ్రు లొనరించినట్టి యఘము
తొలగిపోవగ కలువరి సిలువపైన
ప్రాణమాహుతి జేసిన పరమతండ్రి
నాకు నెలవిమ్ము! నీ దివ్య లోకమందు.

# తొలి ప్రధాని

ఏ శుభలగ్నమందు జనియించితివో! భరత ప్రధానివై
దేశ పురోభివృద్ధికి విదేశములన్ దిరుగాడి శాంతి సం
దేశము లందజేసిన సుధీవర! జవ్హరులాలు నెహ్రూ! నీ
ఆశయసిద్ధికై సుజనులందఱు ముందుకు రారె! పొందుగన్

బాలల పండుగై విజయ భాగ్యపరంపరలందు మమ్మలన్
దేలిచి సంతసంబిడియె; నీ శుభ జన్మదినోత్సవంబు; శ్రీ
లాలు బహద్దరుండు తమ లక్ష్యముకోసము 'తాషికెంట' జీ
వాలను వీడె; తత్క్రియల భారము నిందిరగాంధి గైకొనన్;

భరత సవిత్రి బంధముల బాపిననేత! స్వరాజ్య పాలనా
చరణ విధాత! బాలల ప్రసన్న మహోదయ విశ్వదాత! నే
ర్పరియగు శాంతిదూత! మన పండిత 'జవ్హరు' భారతీయ సుం
దర హృదయారవిందముల తాండవ మాడుచునుండు
నెప్పుడున్;

హాయిన్ స్వర్గపథంబునం దిరుగు జవ్హర్లాలు నెహ్రూజీ! నీ
ధ్యేయంబున్నెరవేర్చ మమ్మదయతో దీవించినన్ పాజ్నియం
తాయుర్దాయ బలంబదెంత? చెయినా హత్యాకృతంబెంత?ఆం
గ్లేయుల్ వచ్చిన నడ్డు నిల్వగలవారే! పోరులో ధీరులై;

# 47

పంచశీల వినూత్న పాశాలు పెనవేసి
దేశ దేశాలు బంధించినావు;
బాపూజి సిద్ధాంత ఫలరసంబుల గ్రోలి
ధర నహింసా సూక్తి దలచినావు;
వలపు నవ్వుల మించు తొలిభారత ప్రధాని
పదవీ వధూటి చే బట్టినావు;
మిత్రమండలి నాత్మ శత్రువులకు గూడ
కోరి సభ్యత్వంబుఁ గూర్చినావు;
దుష్టచైనీయు లనిజేయ దూకినపుడు
పొంగి దేశరక్షణ దీక్ష బూనినావు;
జవ్హారు మహాశయా! నీవు చనిన నేమి?
కలవు మామధ్య నీ కీర్తి వెలుగుతోడ;

# అశ్రుధారలు

ప్రవచనవాణి నూతన నిబంధన క్రీస్తుచరిత్ర పేరుతో
నవతరణంబు జేసి పరమార్థము గానముఁజేయు నేటి క్రై
స్తవుల సమాదరించిన సుధారస వాక్పరిపూర్ణ! జాషువా
కవివర! కన్నుమూసితివ! కాల కిరాతుని ఘోర దుష్కృతిన్;

ఘనవిద్యా సముపాసకుండవయి దీక్షన్ బ్రాహ్మణాకాశ ప్రాం
గణసీమన్ బ్రవహించు నాంధ్రకవితా గంగమ్మ నస్పృశ్యతా
వనికిన్ దించి భగీరథ ప్రతిభ సంపాదించి విఖ్యాతి గాం
చిన నిన్నెట్టుల మృత్యుదేవి కబళించెన్ జాషువా సత్కవీ!

సుకవీంద్రుండగు 'చెళ్ళపిళ్ళ' సభలో సుస్వాగతంబిచ్చి యీ
సకలాంధ్రావని నూపు నీదు కవితా సావిత్రి నీక్షించి కా
లికి 'తోడా' నిడి దిగ్గజంబవని యూరేగింపు గావించె; నే
రికి లభ్యంబగు నిట్టి సద్యశము ధాత్రిన్ జాషువా సత్కవీ!

'గబ్బిలము'నకు నీ కథ దెల్పి కన్నీట
పరమేశునకు వార్తఁ బంపి పంపి
'పిరదౌసి' రసరాశి తరగ లుప్పొంగించి
కవిచంద్రులకు నీత గఱపి గఱపి
'ఖండ కావ్య' వనంబు గల్పించి సాహితీ
ద్రుమ వల్లరుల నంటు ద్రొక్కి-త్రొక్కి

'స్వప్నకథా' రత్న సౌధాగ్రమున నిల్చి
పండువెన్నెల కాంతి పంచి పంచి
అలసటం జెంది వార్ధక్య మలముకొనిన
సత్కళా ప్రపూర్ణా! కవి చక్రవర్తి
అన్న! గుఱ్ఱము జాషువా! నిన్నుమ్రింగ
చెనటి మృత్యువునకునేమి చేటుమూడె!

కమ్మని నీ ప్రబంధ సుమగంధము గుమ్మలు గుమ్మలై సమ
గ్రమ్ముగ వీచె నీ తెలుగు గడ్డపయిన్; కవితారసజ్ఞ చి
త్తమ్ములు పుల్కరింప చరితార్థుడవైతివి; భౌతికమ్ముగా
నిమ్మహిఁ జచ్చినన్ బ్రతుక వే! చిరకాల యశశ్శరీరివై;

రాజగు షాజహాను తన రాణికి గట్టిన పాలరాతి ముం
తాజ మహాలుపైన కవితామహలుజ్జ్వల పద్యరత్న వి
భ్రాజముగా రచించి యజరామర కీర్తినిగన్న నీకు సే
రాజులు సాటిరారు కవిరాజ! కవిత్వమనోజ! జాషువా!

స్వాగతంబిచ్చెనా! స్వర్గాధిపతి నీదు
కులగోత్రముల ప్రశ్న వెలయనీక
ఆహ్వానమిచ్చెనా! అరసి బృహస్పతి
సహపంక్తిలో సుధా సవముద్రావ
ఆశీస్సులిచ్చెనా! బోసినవ్వుల తాత
కడు ముదమ్మునగ్రుచ్చి కౌగిలించి

చేయెత్తి పిల్చెనా! చెళపిళ్ల వేంకట
శాస్త్రి కవనగోష్ఠి సలుప నెంచి
కనక రత్నాభిషేకంబు గండపెండె
రములు బిరుదులు స్తోత్ర పత్రములు సరులు
నందుచున్నవె! నాకము నందుగూడ
తెలుపుమయ్యా! జాషువకవీ! పలుకుమయ్యా!

కులహీనుండు రచించు కావ్యమది నిగ్గుల్గుల్కినన్ గైకొనన్
వలదన్నాడు కులీను డప్పకవి; తద్వాక్యమ్ము సత్యంబనన్
తళుకుం గబ్బములల్లి పండితుల సన్మానంబులం గాంచి మా
తెలుగుం జాతిని మేలుకొల్పితివి భక్తిన్ కావ్యరత్నద్యుతిన్;

పరగ "జాతస్య మరణంధ్రువ" మ్మటంచు
నెఱిగి నిశ్చింతగా దివి కరిగినావ!
కృతులలో కలకాలంబు బ్రతుకగలవు
అన్న! జాషువా! నీకు శ్రద్ధాంజలిదియె!

ఏ శ్మశానవాటికను వర్ణించి నీవు
అల 'హరిశ్చంద్ర' పాత్రకు బలము నిడితొ!
ఆ శ్మశానవాటికయె నిన్నభినుతింప
దలచి మృత్యుముఖంబున పిలిచెనేమొ?

# పంచాయతీ రాజ్యలక్ష్మి

కాలవాహినిలోన పేచీలు పడిన
పాలన విధానముల కీడుమేలు లరసి
ప్రజలఁ బ్రేమించి సత్కీర్తి బడసినావు;
రమ్యచరిత! పంచాయతీ రాజ్యలక్ష్మి

శాలల విద్యకై ధనము బంచి వ్యయించి నిరక్షరాస్య ని
ర్మూలన శాసనాలగొని ముందుకుసాగితి; వయ్యవార్ల క
ష్టాలను దీర్చి పెద్దలకు జాలినవిద్య ననుగ్రహింపగా
చాల శ్రమించు నిన్నుఅవజాలము కాలము మారిపోయినన్ ;

హాయినిగూర్చి కర్షకుల కప్పులనిచ్చి సహాయధాన్య సం
ధాయినివై వినూతన పథంబున సేద్యము వృద్ధిగాంచ, నీ
తీయని సూచనంబులిడి దేశ శుభోదయ మెంచినావు; పం
చాయతి రాజ్యలక్ష్మి! సుఖశాంతుల కాంతుల కాలవాలమై;

పల్లెసీమల నూత్న పాఠశాలల నిల్పి
విద్యా సుగంధంబు విసరినావు;
మా కుటీర పరిశ్రమల వృద్ధినాశించి
కుట్టు కేంద్రములను బెట్టినావు;
దీర్ఘాయురారోగ్య దీప్తివర్ధిల నిండ్ల
చెంత కౌషధముల జేర్చినావు;

నిమ్నోన్నతంబైన నేలను చదును చే
యించి రాస్తాల వేయించినావు;

మధుర జలములతో నిండి మనసు గొలుపు
మంచినీటి బావులను త్రవ్వించినావు;
మించి లాలించి ప్రజల బాలించినావు
పూజ్యశీల! పంచాయతీరాజ్య రమణి

వంటగదిన్ వసించి పొగబారిన కండ్లను పైటకొంగుతో
నంటుచు బాధలంబడు కులాంగనలన్ గని జాలిజూపి వె
న్నంటి శుభంబుబల్కి యభయంబిడి గొట్టపుపొయ్యులిచ్చి త
త్కంటకమున్ హరించితివి కాంతలపాలిటి కల్పవృక్షమై;

వెనుకటి కాలమందు పృథివీశుల యేల్బడి నౌషదంబులన్
మనుజులకే యొసంగిరి ప్రమాదములో; నిపుడన్ననో! కనుం
గొన పశుజాతికిన్ మఱియుకోళ్ళకు నిచ్చిరి సూదిమందు నీ
ఘన పరిపాలనంబున సుఖంబెగదా! యిక ప్రాణికోటికిన్;

రంజిల్లితివి! కృష్ణరాయల సాహితీ
మధుర వేదికలపై మనసు నిల్పి
కనుపించితివి! అశోకుని ధర్మ చక్రంబు
గొని శాంత్యహింసల గుట్టుదెలిసి

53

ప్రకటించితివి! నీతి; బాపుజీ నిర్మాణ
కార్య గర్భాంతర గరిమ దలచి
నినదించితివి! జవ్హారుని యనంత ప్రేమ
సందేశమును విశ్వసార మెఱిగి
సద్యశము గాంచితివి మౌర్య చరితలందు
భారత సతీమణికి ముద్దుపట్టి వగుచు
వర్ధిలగదమ్మ వేయేండ్లు వఱకు నీవు
ప్రతిభగన్న పంచాయతీ రాజ్యలక్ష్మి!

# క్రొత్త సంవత్సరము

రాటపాకులవలె వత్సరములు గడచి
దైహిక వినూతన పరివర్తనము గలుగ
మానసికమైన మార్పు నీలో నాకింత
కనబడకయున్న నాత్మరక్షణము సున్న

ఏండ్ల నెడి కిలోమీటర్ల నెంచికొనుచు
నీ బ్రతుకుబాటలో బయనించునపుడు
భావపరిణామ మించుక బడయకున్న
గమ్యమును చేరలేవు; నిక్కముగ నీవు;

క్రిందుమీదుగ పెద్ద రాకెట్లలోన
నంబరము దాటి చంద్ర గోళంబుమీద
మానవుడు కాలుమోపు విజ్ఞాన యుగము
నందయిన మారు మనసును పొందలేవె!

ముద్దుగా బఠించిన కావ్య పుటలవోలె
గడచె ప్రాత వత్సరము నీ కండ్లముందె!
వచ్చె జనవరితో నూత్న వత్సరంబు
బ్రతుకు సరిదిద్దికొనుము; జీవమును గనుము;

## 55

మాసిపోయిన జీవిత వ్యాసరచన
త్రిప్పి చూడక పరమాత్మ దీప్తిఁ బొంది
క్రొత్త సంవత్సరము క్రీస్తు గోరినట్లు
నడచికొమ్ము; శుభంబుల నందికొమ్ము.

# రాధాకృష్ణ పండితుడు

వేగుజుక్కయు రవియును విబుధవరులు
తూర్పున జనింతురని సీమ దొర లెఱుంగ
పుట్టినట్టి 'రాధాకృష్ణ' పుణ్యమూర్తి!
నీవలన శాస్త్రములకు క్రొంజేవ గలిగె;

చెలువంబొప్ప స్వదేశ భాషలను నిశ్శేషంబుగా నేర్చి య
వ్వల ఖండాంతర సీమలం దిరిగి సౌభ్రాతృత్వ సందేశ సూ
క్తుల నందించిన వేళలందయిన హిందూజాతి సంస్కారమున్
తలపాగన్ నిలబెట్టి చూపితివి; రాధాకృష్ణ విద్వన్మణీ!

మానిత సత్కళానిధి! సమంచిత ప్రజ్ఞనొసంగు మీ సమా
ధానము లుత్తమోత్తమ విధానములంచు దలంచి సీమ క
వ్వానిని బంప మెచ్చికొని పండితవర్యులు పాఠ్యపుస్తక
ధ్యానముతో బఠించిరి గదా! పెనువిద్యల నభ్యసించుచున్;

రచియుంచితివి; గ్రంథరాజమ్ము లొక కొన్ని
ఆంధ్రాంగ్ల తత్త్వశాస్త్రార్థ మెఱిగి
వెదజల్లితివి; దివ్య వేదాంత మర్మంబు
పరమార్థ చింతన పాదుకొల్పి

ప్రకటించితివి; దేశభక్తి తాత్పర్యంబు
రాజకీయ విశాల రంగమెక్కి
వినిపించితివి; జాతి ఘనతను సీమలో
సాగరోర్మికలపై సాగనంపి
అమల విశ్వవిద్యాలయాధ్యక్ష పదవు
లందినావు; బెనారసు నందెగాక!
ప్రేమ సుమములు విరిసి పరిమళింప
భారతాధ్యక్ష! జాతి సౌభాగ్యదక్ష!

వెతలెదిరించి శిష్యులకు విద్యలనేర్పెడి పంతులయ్యవై
బ్రతుకును సాగదీసికొని భారతదేశ మహాధినేతగా
స్తుతుల గడించినావు; పరిశుద్ధ మనస్కులు భావిజీవితో
న్నతులనుగాంచి జీవిత వనంబున కీర్తిసుమాలు నింపరే!

తత్త్వశాస్త్ర పయోనిధి తఱచి తఱచి
భావరత్నంబుల గ్రహించి ప్రతిభ మెఱయ
సానబట్టి గ్రంథములుగా సంతరించి
యశము గాంచితివయ్య! విద్యాఫణీంద్ర!

# బాల సూక్తులు

ఒక్కఁడైనఁ జాలు నుత్తమ గుణశాలి
గడపునోపు నెట్టి కార్యమైన
ఆంగ్లజనుల సీమ కంపలేదా! గాంధి
భవ్యగుణ విచార! బాలవీర!

పంచశీల సూత్ర బంధన నిర్మాత!
శాంతిదూత! సత్య సమర నేత
జవ్హరుండు భరత జాతిరత్నమ్మురా!
భవ్యగుణ విచార! బాలవీర!

ఆంధ్రరాష్ట్రసిద్ధి నాశించి నిరశన
వ్రతము బూని తనువు వదలినాడు
పూజనీయుడౌర పొట్టి శ్రీరాములు
భవ్యగుణ విచార! బాలవీర!

విష్ణుమతము జూచి వెక్కిరించు నొకండు
శివమతంబు నొకడు చీదరించు
మతముకన్న మంచి మనసు ముఖ్యమ్మురా!
భవ్యగుణ విచార! బాలవీర!

కావ్య నాటకముల కమ్మని సంస్కృత
భాషలోన దీర్చి వ్రాసినాడు
కవి జగద్గురుండు కాళిదాసుండురా!
భవ్యగుణ విచార! బాలవీర!

చెలువమొప్ప విష్ణు చిత్రీయమును వ్రాసి
అష్టదిగ్గజముల నాదరించి
ఆంధ్రభోజు డయ్యెరా! కృష్ణరాయలు
భవ్యగుణ విచార! బాలవీర!

ఉద్ధరింతు ననుచు ఓటులన్నియు గుంజి
గద్దెనెక్కియున్న పెద్దమనిషి
గ్రుడ్డివాలె ప్రజల గుర్తింపడేలరా!
భవ్యగుణ విచార! బాలవీర!

హితగుణంబులేని సుతులు నూర్వురకంటె
గుణగరిష్ఠు డొక్క కొడుకు మేలు
రత్నములకు సాటిరావు రాళ్ళెన్నైన
భవ్యగుణ విచార! బాలవీర!

ద్రోణ శల్య కర్ణ దుర్యోధనాదుల
బెగ్గలించి తమ్మి మొగ్గరమున
విక్రమంబు జూపె వీరాభిమన్యుండు
భవ్యగుణ విచార! బాలవీర!

కులమతాలగోల తొలగి పార్టీలన్ని
గొడవమాని యైక్య పడిననాడు
రామరాజ్య మగునురా! ప్రజారాజ్యము
భవ్యగుణ విచార! బాలవీర!

# రతనాల మాలిక

## (గేయము)

బీ, వి, నరసింహాభిధానా!
పేరు గాంచిన కవి కులీనా!
తెలుగు భారతి నీ కలాన
వెలుగు జిమ్మిన దీ జగాన॥

హావభావ ప్రదర్శనాలకు
అందెవేసిన మీ స్వరూపం
భావిపౌరుల జీవితాలకు
బాటలను జూపించు దీపం॥

అలతి పదములతోడ భావం
తెలియజేయుట చాల కష్టం
విలువగల భావముల సులువుగ
వెల్లడించుట మీ యదృష్టం॥

గాలి తాకున నూగు 'దిరిసెన'
పూల బోలిన మీదు కవనం
బాల బాలిక హృదయముల ను
య్యాలలూపు మహేంద్ర భవనం॥

బాలబంధూ! నీకిదే! రత
నాల మాలిక నందుకొనుమ
పాలిపోవని కీర్తితో చిర
కాలమును సౌఖ్యాల గనుమ॥

—: సమాప్తము :—

# ఈ పుస్తకాన్నిగూర్చి—

కవిత్వం రాయడం తరతరాల హక్కుగాదు, తాత ముత్తాత లిచ్చిన ఆస్తి కాదు. సంస్కారం - సాధన-అనుభవం-ఆవేశం మేళవింపబడితే మేలైన కవిత్వం రూపొందుతుంది. కవి హృదయం కలవర పరచిన శోకమే శ్లోకమై మహాకావ్య మావిర్భవించింది. కవిత్వానికి కులంతోనూ, స్థలంతోనూ పనిలేదు. కావలసిందల్లా కలంలో బలం.

శ్రీ మల్లవరపు జాన్ ఆధునిక సామాజిక వ్యవస్థను బాగుగా ఆకళింపుచేసుకొన్నవాడు. సెక్యూలరిజం ముసుగులో దాగిన సత్యాలు చవిచూచినవాడు. సమాజాన్ని మేల్కొలుప నెంచినవాడు. అందుకే మహాపురుషుల జీవితాదర్శాలను పలు శీర్షికల్లో ప్రత్యక్షం గావించాడు. విశ్వ ప్రకాశాన్ని వెలిగించాడు. రసవత్తర కావ్యం రచించాడు.

ఛందోబద్ధంగా సరసమైన శైలిలో సామాన్య పాఠకుణ్ణి సైతం ఆకర్షించాడు. మధురకవి అనిపించాడు. మానవతను మేల్కొలిపాడు.

—దయానంద